శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మణేనమః

56/19 879/9419

# గుండెగుభేల్

(అను జ్ఞానరాడి)

PNC 209 SINC 7

అయిదంకముల సాంఘికనాటకం.

56

శ్రీ నరవ సూర్యకాంతంచే

రచియింపబడియె.






మొదటికూర్పు 1000 ప్రతులు.

1942 సం॥రం

రిజిష్టరు కాపీరైటు] [వెల రు. 1-4-0

శ్రీ వేంకటేశ్వర పరబ్రహ్మణేనమః

# గుండెగుభేల్

(అను జ్ఞానకౌడి)

ఐదంకముల సాంఘికనాటకం.

## శ్రీ నరవ సూర్యకాంతంచే

రచియింపబడెను.




6 - JUL 1942

మొదటికూర్పు 1000 ప్రతులు.

1942 సం॥రం

పెద్దాపురం కోహినూర్ ప్రెస్‌యందు ముద్రింపబడెను.

[రిజిష్టర్డు కాపీరైటు]

వెల రు. 1-4-0

# ఈనాటకమునవచ్చు పాత్రములు.

బలేరావు :— కథానాయకుడు.

రామనాథం :— రెండవ కథానాయకుడు.

హరివర్మ :— రామనాథంచెలికాడు.

వెంకటాద్రినాయుడు<br>రామిశెట్టి<br>లడ్డూఖాన్ } రామనాథందగ్గిర సొమ్ముపుచ్చుకున్న లంచగొండ్లు.

గజపతిలాల్<br>వీరేంద్రకేశరి<br>తిరుమలరావు } బోరు మెంబరు

ప్యూన్ :— బోర్డు బంట్రోతు.

చెమిటిశంబడు :— గ్రామనౌఖరి.

అపవాదుడు :— కథానాయికతండ్రి.

దిలనాసికం<br>మృత్తికేశ్వరం } వాది, ప్రతివాదులు.

మల్లిగాడు<br>యల్లిగాడు } దొంగలు.

జ్ఞానయోగి :— తత్వవేత్త.

## స్త్రీలు.

ఇందిరాభాయి :— కథానాయికి.

చక్రికేళి :— ఇందిరాభాయిచెలికత్తె.

కమలాభాయి :— బలేరావుభార్య.

అత్తగారు :— కమలాభాయిఅత్తగారు.

కంజాక్షి :— కమలాభాయిస్నేహితురాలు.

ఇంకను సందర్భానుసారముగా కొందరువత్తురు.

# విజ్ఞాపన.

పాఠక మహాశయులారా! పెద్దాపురం తా॥ కామరాడగ్రామములో
నామిత్రులుగొంతమంది నొక సాంఘికనాటకమును రచించుమని
నన్నుగోరినందున యీరూపకమును రచించితిని దీనిని
దప్పులున్న నన్నుమన్నించుదురని మిమ్ముల
ప్రార్ధించుచున్నాను.

ఇట్లు
గ్రంధకర్త.

ఈ నాటకము నా యను
మతిలేనిది ప్రింటింగు చేయించుటగాని,
ప్రదర్శించుటగాని, సినిమాలలో గాని, రికార్డులలో
గాని, పద్యమునుగాని పాటగాని వేయగూడదు. అట్లువేసిరేని
మా నష్టమునకు — బాధ్యులయ్యెదరు.

ఇట్లు
గ్రంధకర్త




# ప్రథమాంకము



## నాంది

క. శ్రీరాధా రుక్మిణీసతి
సారెకు సంతోషపరచు ♦ చక్కని కృష్ణున్
గోరి హృత్కమలమందున
నారాధన జేతు నెపుడు ♦ సత్ప్రోచుటకున్.

ఉ. దండిగ యల్లమిల్లిపుర ♦ దేవళమందున ఖండ తేజు డే
కొండల వెంకటేశ్వరుని ♦ గోరి భజించియు సాంఘికంబుగా
గుండెగుభేలు రూపకము ♦ గూర్చితి దీనిని దప్పులున్న నో
పండితులార మీ పదము ♦ బట్టుచు నన్ను క్షమించ వేడెదన్.

(ప్రవేశం—సూత్రధారుడు)

ఆహా! నేడెంత సేపు నిరీక్షించుచున్నను నాప్రియురాలు నటిజాడయే గనబడకున్నది. నీసభ నన్వేషించిన మహామహుల గలకలము వినినగొలది నాకర్ణరంధ్రములు బదరీకృతముల నొంది మేను జిరుజెమటలు వెట్టగ గరచరణంబులు కదలక స్తంభీభూతములౌ చున్నవిగదా! ఇంక నేనేమి చేయువాడ నేరూపక ముపక్రమింతుమన్నను స్ఫురణకే బొడగట్టకున్నది. ఏమి చేయుదును.

ఉ. గతలన్ గార్యము ఘాసిగా ♦ గరణ తంత్రంబందులన్ మంత్రియా
సతి యెచ్చోటికి నేగెనో ♦ సమయమయ్యెన్ రూపకం బాడగా
మతి చాంచల్యము నొందెనే ♦ మసల నిష్టంబింతయున్ లేదు
యీతరి గార్యంబును నెట్లు ♦ నీదగలనో నిచ్చావిహారంబునన్

అయినను నింకొక్కమారు బిగ్గరగా బిలచి చూచెద (ప్రకా) ప్రాణేశ్వరీ
ప్రాణేశ్వరీ !!

(ప్రవేశం:-నటి) ఆ! యిదేవచ్చుచున్నాను ఏమి అంతతొందరగా
బిలుచుచుంటిరి!

సూత్ర—(కోపముతో) ఓసీ! అభాగ్యలక్ష్మీ! ఇంకను దొందరను
చుంటివా అనుగో యీ సభ వైపుజూడుము.

గీ. తొమ్మిదిన్నర కొటంచు ♦ దొలుతజెప్పి
వీధులందున బేపరుల్ ♦ వెలయజేసి
రంగతలమున జూడ నే ♦ హంగులేదె
అంచు మనపైని గోప ♦ నిరీక్షణముల
జూచుచున్నారు ప్రేక్షకుల్ జుర్రుమనుచు

అగ్నిజ్వాలలవలె జూచుచున్న యీసభాసదుల మనఃకమలములు వికసిం
పజేయు నొకజక్కని నాటకరాజంబు నేదైననుండిన వచింపుము

నటి—నాథా యీ సభాసదుల మెప్పించు నాటక మేలేదా గుండెగుభే
లను సాంఘిక నాటకమీమధ్య వెలువడినది అది యాడిన సభా
సదుల మెప్పించవచ్చును.

సూత్ర—ఏమేమీ గుండెగుభేలా ఎప్పుడును వినియుండలేదే యీ
నాటక గథ యెట్టిది ఏకవి పూరించినది.

నటి—నాథా కవియెవ్వరో దెల్పుమంటిరా దెల్పిన నీసడింతురేమో

సూత్ర—సరిసరి ఇదియొకటియా కవినీసడించుటకు గుకవిననుకొంటివా
కవి యెవ్వరో దప్పక నుడువుము.

నటి—అట్లయిన జెప్పెద వినుడు.

సీ. కవి జన్మభూమి శ్రీ ♦ కాకినాడ పురంబు
దరువాత నుప్పాడ ♦ దనకు నెలవు
నరసనూరయ్యకు ♦ నాత్మజుండైనట్టి
కనకంబె యాతని ♦ కన్నదండ్రి
యాయ ముత్యాలయ్య ♦ వరపుత్రియైనట్టి
గంగమాంబీతని ♦ కన్నతల్లి
సతి యనసూయకు ♦ సాటియై మెలగెడు
చిట్టెమాంబకు ప్రియ ♦ సోదరుండు
సూర్యగాంతంబునా పేర ♦ జెలగువాడు
కవివరులగాంచి కనుభక్తి ♦ కరము లెత్తి
మ్రొక్కుచుండును నీతడు ♦ ముదమొలర్ప
లీల విరచించె గుండె ♦ గుభేలునాగ.

ఇంకను,

ఆ. రహిని గింతాడ వెంకట ♦ రత్నమునకు
మేనయల్లుండ యాతడు ♦ ముద్దులొలుక
గెంతులేయుచు నీమధ్య ♦ కవినటంచు
బయలుదేరెను నీతడు ♦ భళిరయిప్పుడు.

సూత్రి—సరియేగాని తాను రచించిన రూపకమునకు గుండెగుభేలను నామము నుంచుటకు గారణమేమైయుండునో!

నటి—ఆకారణము కవియే జెప్పెను.

సూత్రి—ఏమని

నటి—

సీ. ఇందిర జారత్వ ♦ మీక్షించు వనితల
గుండెగుభేల్ మను ♦ గారణమున
బలెరావు దాపుగుడి ♦ బరికించు జనులకు
గుండెగుభేల్ మను ♦ గారణమున

లోభుల వాక్కులు ♦ చెవివిన్న ధీరుల
గుండెగుభేల్ మను ♦ గారణమున
లంచ మపేక్షించు ♦ లంచగొట్లకు నెల్ల
గుండెగుభేల్ మను ♦ గారణమున
గీ. మెట్టవేదాంతులకు నెల్ల ♦ మేనువణక
గులటలకు గుండెజారి ♦ గుభేలుమనగ
నామకరణంబుచేసె నీ ♦ నాటకంబు
నిలుచు నాచంద్రతారార్క ♦ మవనియందు.

సూత్ర—బలే జక్కని కధయే రచించెను ఈరూపకము బ్రదర్శించి సభాసదుల జిత్తరువట్లు జేయగలుగుదుము ఇంకనాలసింప దగదు (ఇటునటుజూచి) అదుగో రామనాధము దన మిత్రులతో నిటే వచ్చుచున్నాడు రమ్ము బోవుదము.
(నిష్క్రమింతురు.)

యిదిప్రస్తావన.

## రంగము 1.

[కమలాపురం నడివీధిలో రామనాధం, బలేరావు, హరివర్మ ప్రవేశము.]

రామనాధం—మిత్రులారా నేడు మనముప్పురము గలుసుకున్నందులకు నాకు నపరిమిత సంతసంబును దీరని విషాదంబును గల్గుచున్నది ఏమనియెదరా
గీ. కాఫిహొటలకు వెళ్లుట ♦ ఖారఖిల్లి
నములుటయెగాని మన ♦ కొక నడతలేదు
ఎపుడు నద్యోగములు మాని ♦ యింటదినుచు
దిరుగుచుందుము బీడికె ♦ దిరెపెమెత

ఇట్టి కాపురమ గుణంబుల దగిలి కాలము వృధబుచ్చుచున్నాము గాని మనమే విద్యయందును బరిపూర్ణ మనోరధసిద్ధిని బొందలేక సుద్ధజనులవలె దిరుగాడుచున్నాము మనకు ఏవిద్య యాహ్లాదము గొల్పునో ఏవిద్య మనలనానంద వార్ధిని ముంచునో అట్టి సంగీతవిద్య మనము వ్యర్థమా

శా. సంతోషంబును మీరగా మనము ♦ సంగీతముఁ గ్రావ్యమై స్వాతంబున్
వింతన్ గొల్పగ నేర్చి నేర్చి వసుధం ♦ విఖ్యాతియూ ట్టిగా
బంతం బొప్పగ బాడగావలెను హో ♦ భేషంచు విద్వత్కవుల్
జెంతన్ జేరగదీసి నారదుడవా ♦ శ్రీకృష్ణ దేవుండవా.

అని బొగడునట్లు బాడవలయును. ఇట్టి సంగీత మభ్యాసమునకు మీరే మరియెదరు

హరి—సంగీతంబన్న నాసర్వేశ్వరుని లీలలు వర్ణించుటయేగదా నాకు సర్వజనాదరణీయంబగు సంగీతంబని యిష్టమే అయినను మనము—

చం. హరిని భజింపగావలయు ♦ నాత్మను జింపహ్వాను బాడగావలెన్
నరహరి నామమెప్పుడును ♦ నల్గురుముఁ వచియింపగావలెఁ
సరిగమయంచు నాట్యమును ♦ సల్పుచు శ్రీహరి పాదసేవలన్
మరువకజేసి మాయదగ ♦ మాటుచు ముక్తిని బొందగావలెన్

రామ—మిత్రమా నీవు అపర రామదాసునివలె అగపడుచున్నావే ప్రతిగీతమందు హరిని నెలగొల్పి బాడిన రుచించునా

హరి—వెర్రివాడ హరికన్న పరుడెవ్వడు. అనాది పురుషుండగు నా పరంజ్యోతి స్వరూపుండగు రాముని బాడక తుచ్ఛులగు మానవాధముల గీతములందు నిమిడ్చి బాడిన నరునకు తెరవేది

గీ. జన్మమెత్తుట జచ్చుట ♦ జగమునందు
బుట్టుటయు గూడ దుఃఖమే ♦ బుద్ధిదలప

జావుబుట్టగలేని యా ♦ జన్మకొరకు
హరిని బ్రార్థించి మేగకే ♦ యాదిఋషులు

రామ—(తనలో) ఈతడు నారద ప్రహ్లాదులవలె పరమ భక్తసిఖా
మణియనుటకు నేమాత్రము సందేహము లేదు. ఏమి యితనిభక్తి
(ప్రకాశముగా) మిత్రమా నీయిష్టము వచ్చినట్లు శ్రీహరి
పాదారవిందములు డెందముల నిడుకొని రామకథాసుధారసం
బగు త్యాగరాజు కృతులను బాడుకొందుమా

హరి—నిస్సందేహముగా బాడుకొందము

రామ—(బలేరావు వైపుదిరిగి) ఇందుకు మన బలేరావేమనునో గను
గొనియెద. (ప్రకాశముగా) మిత్రమా సంగీతమభ్యాసము చే
యుట నీకిష్టమేనా

బలె—సరిసరి సంగీతమా "తుదకబ్బెరా తురకబాసయన్నట్లు"
యిప్పుడు మనకు సంగీతమా!

గీ. మూతిపై నూగుమీసంబు ♦ ముచ్చటాడ
షోకుజేయుచు సినెమాలు ♦ చూడకుండ
జెడిన కోతియు వనమెల్ల ♦ జెరిపినట్లు
చచ్చు సంగీతమెందుకు ♦ సఖుడ మనకు

సంగీతమంతయు నిదివరకే జెడి సినీమాల యందు జచ్చుచుండ
నింక మనము సంగీతము నేర్చి యెక్కడ జూపవలయు మనకిదివ
రకున్న స్వేచ్ఛనువదలుకొని నిద్దురమాని గొంతుకెత్తి అరచినం
తమాత్రంబున సంగీతమలవడునా యీపిచ్చి యూహలు మాని
యిదివరకు మనకున్న నిరోద్యోగ డిపార్టుమెంటునే బలపరచిన
అన్ని సంగీతములు నందునే యున్నవి.

రామ—సఖుడా అట్లుగాదు జన్మమెత్తిన ప్రతినరునకుంగూడ

గీ. విద్యలుండిన గీర్తియు ♦ విభవమబ్బు
విద్యలందున సంగీత ♦ విద్యమేలు

విద్యలేనట్టి మనుజుడీ ♦ వసుధయందు
వ్యర్థుడే గాక యెందున ♦ మర్థుడౌనె

గనుక మాయిరువురతోపాటు నీవును సంగీతమభ్యసించి సహకారి విగమ్మని నాప్రార్థన ఇంక నామాటగాదనక నాయభిప్రాయము నంగీకరించుము.

బలే—సరియే నలుగురితోపాటు నారాయణ గులముతోపాటు గోవింద యన్నట్లు మీతోపాటు నేనును మీ యాభిప్రాయము నంగీకరించితిని గాని నాయిష్టమువచ్చిన చోవ్వున వచ్చువాడ.

హరి—(బలేరావు వైపుజూచి) మిత్రమా సాధుల మనఃకమలముల విహరించు నారామచంద్రుని నోరార బాడుటయే సంగీత సారాంశముగదా

గీ. నారదుడు తుంబరుడును ♦ నారతంబు
నాదినారాయణునియందె ♦ యాత్మనిల్పి
సరస సంగీతచాతుర్య ♦ సరణిదెలసి
బాడి హరిభక్తిచేతనే ♦ బేరుగాంచి

బలే—అబ్బో! అంతటి భక్తులమామనము ఇప్పటిభక్తులను ఇప్పటి వేదాంతులను నెరుగవు గాబోలు! ఎరిగియున్న నిట్లు వచించి యుండవు.

సీ. విధవలకెల్లను ♦ వేదాంతమునుదెల్పి
వెంట నిడుకొనిబోవు ♦ శుంఠయొకడు
మెట్టవేదాంతంబు ♦ గుట్టలగొలదిగ
పదిమందికిని జెప్పు ♦ పందయొకడు
గంజాయి గడుతాగి ♦ గంతులు వైచుచు
తూలగి సద్గురుడను ♦ చెనటియొకడు
శిష్యురాండ్రకు నెల్ల ♦ చిదూపములుజూపి
పగలె యింటను దాగు ♦ భడవయొకడు

గీ. తుదకు వేదాంతమంతయు ♦ దొమ్మరింట
గుమ్మరించియు సానిని ♦ గారవించి
పిదప సాయుజ్యమును జెందు ♦ సాధుజనులె
గాని యొక్కడైన నిజమగు ♦ జ్ఞాని గలడె

ఎవరైనా మహాత్ములున్న నుండవచ్చునుగాని ప్రస్తుతం మనగ్రామములవెంట దిరుగు వేదాంతులు యున్నవిశాంతుల కోసము ద్రవ్యముకోసమేగాని మోక్షము ముక్తికోసమూ గాదు ఇంక మహాభక్తులమని బయలుదేరు భక్తపుంగవుల సంగతి నాలో చింతమన్న —

సీ. గోసాయినంచు తా ♦ కాషాయ వస్త్రముల్
గట్టి దాగుచు దిప్ప ♦ కళ్లు కొకడు
ఒడలెల్ల భూతియు ♦ మెడను రుద్రాక్షలు
గల్గి భక్తుడనంచు ♦ గెంతునొకడు
చెడువాసనల నొప్ప ♦ సిలుమున గంజాయి
దమ్ముగొట్టియు దగ్గి ♦ తుమ్మునొకడు
బంగారమును జేతు ♦ భస్మంబులను జేతు
నని డాంభికము గొట్టి ♦ యరచునొకడు

గీ. వ్యాఘ్ర చర్మంబులను దాల్చి ♦ వసుధయందు
మూటలను మూపునందున ♦ మోసిమోసి
నిశిని నన్నంబులకు దిరుగు ♦ నియతవరులె
గాని నిజమైన భక్తులు ♦ గానబడరు

రామ—మిత్రమా నీవన్నమాట నిశ్చయమేగాని పరిపూర్ణజ్ఞానయోగానందులును అపరభక్తశిఖామణులున్నూ లేకున్న సీధరాతలంబు నిలచునా అట్టివారిట్టి డాంభికము లేమియు లేక బాలుల చందంబున సర్వసంగ పరిత్యాగులై సంచరింతురు.

బలే—నిజమే. అట్టి మహానుభావులు మనగ్రామములందు మాయల బన్ని సంచరించడమే యుండదు.

రామ—సరియేగాని మనము సంగీతము పాడుటకు దగిన సౌధరాజ
మును నిర్ణయించవలయును గాన మన వీట గానమందరము
నకు దగిన చోటుండిన విచారించి చెప్పఁగోరెదను.

బ —ఈ కమలపురంబున నొక సౌధమున్నది గాని యది శిథిలత్వ
మొందుటంజేసి జెప్పుటకు నొప్పకున్నాను. అది పరిశుభ్రపర
చిన యెడల సంగీతము భ్యాసగృహమునకు వీలుగా యుండ వచ్చు
ను. (హరివర్మ వైపుజూచి) మిత్రమా నీయభిప్రాయ మేమి !

హరి—నాయభిప్రాయము జెప్పుట కేమున్నది గానమందిర దరిదాపున

చ. ఇతరజనంబులెవ్వరును ♦ నాదరి నుండగరాదు నెప్పుడున్
సతతము నిర్మలంబగు ♦ మనంబుకు శాంతినిజేయఁగావలెన్
అతులిత తేజుడైన గురు ♦ నార్యుని యానతి దప్పకుండ యా
కృతులను బాడి గూరిమితో ♦ గాతక మొందగ నేర్వఁగావలెన్.

గాన నితర విషయ లంపటులముగాక, సంగీతమందిరమున నిశ్చింతతో
నీరజాక్షునిఁ బాడుకొందము. గనుక బలిరావు జెప్పిన బాడుపడిన
మందిరమే నాకును నంగీకారమైనది.

రామ—మీ యిరువురకూ అగృహము నచ్చినదా ? సరియే రే
పుదయమున నా గృహము పరిశుభ్రపరిపించి రాత్రియందు
సంగీతము పాడుటకు నిర్ణయించితి. గనుక ప్రియమిత్రులారా!
మీరు నాటిరాత్రికి విచ్చేయుదురు గాక! ఇంక మన మేగు
దము రండు.

(అందరు నిష్క్రమింతురు.)

## రెండవ రంగము.

స్థలం:—నిద్రాల ప్రదేశము.

ప్రవేశం:—ఇందిరాభాయి, విరహామున

ఇంది—అమ్మయ్యో! అతిగాఢముగా తృష్ణజనించుచున్నది గదా! విరహామున నెట్టిదో యనుకొంటిని గాని యిది కార్చిచ్చువలె నాయొడలెల్ల గాల్చుచున్నదే. ఇంకేమి జేయుదాన?

చ. కలువలఱేని కాకలును ♦ కమ్మని విల్తుని కార్ముకంబును
న్నిల నిలువంగ నోపతగునే ♦ యలజల్లని మారుతంబునన్
అలసట నొంది మేనకడు ♦ నార్తిని జెందగ సింక నేగతిన్
నిలువగదాన? చెవ్వరితో ♦ నేనుని దెల్పుదు నెందు జొచ్చెదన్.

ఆహా! ఇట్టిమరుతాపమునకు మంటయే గష్టముగానున్నదే. ఇంక నేనెట్లు దిరుగాడుదును. ఎట్లు జీవింతును. నా ప్రాణమునకు యీ ఘోరరాక్షసుండగు నా జనకుం డెట్లు దాపరించెను. నాకు వైవాహిక మన్నమాటయే దలపెట్టడు నా మేలు నిసుమంతయు నెదదలంపడు. ఇంకేమి జేయుదాన యిట్టి గ్రూరులగు జననీజనకుల గర్భమున బుట్టుటకంటె కుటజమై బుట్టుట మంచిదిగదా. అయ్యో! నేనెంత మందబుద్ధినైతిని. చిన్నతనమునుంచి నల్లారుముద్దుగా బెంచినయట్టి నా జననీజనకుల నిందించుచున్నానే. ఎంత యవివేకము నానుదుట భర్తలేని బండరాయినై బ్రతుకుమని యబ్జగర్భుడు మూడుపంక్తులు వ్రాసియుండగా నింకెట్లు జరుగును. (అని విచారించును.)

[ప్రవేశం:—చెక్రకేళీ]

చెక్రి—(స్వగ) మాయిందిర యెందులకో తనసుందర వదనారవిందము చిన్నబుచ్చుకొని చింతచే గుందుచున్నట్లు గోచరింపుచున్నది. ఏమయియుండునో? దెలిసికొనియెద. (ప్రకాశముగా) అమ్మా యిందిరా నీసుందర ముఖారవిందము వికసించుటకు మారుగా ముకుళత్వ మొందుటకు కారణ మే మయియుండును.

ఇందిర—(ఉస్సురని యూరకుండును.)

చక్రి—ఏమిది! పిలిచినను నీమగువ మాట్లాడకున్న దే. ఇందిరా! ఇందిరా! (అని బిలచి ముఖము పరీక్షించి) తల్లీ?

గీ. ఇపుడు వదనంబు నేత్రమ్ము ♦ లెఱ్ఱబార
చింతచే గుంది దరి చీము ♦ చిటుకు మనగ
దృళ్ళిపడిలేచి దిక్కులు ♦ దేరజూచి
యడలుచుంటివి యిదియేమొ ♦ యంబుజాక్షి.

నీలో నీవు యిట్లు గుందుచున్న మాకెట్లు దెలియును. నీ విట్లువనటం బొందిన నోదార్చువా రెవరు తల్లీ! యింక నాయెడ దాచక నీ హృదయకంటకముగా నుండు కార్యము నేదైయుండునో వినుపింపుము.

ఇంది—(తనలో) అకటా! యీకుసుమాంత్రిడు కుదురుండ నియ్య కున్నాడే నాచెలి నన్ను గ్రుచ్చి గ్రుచ్చి నడుగుచున్నది. ఏమని వచింతును. (ప్రకాశముగా) ఏమే చక్రికేళీ నామన స్సంతయు నేడు వికలత్వము బొందుచున్నదే?

ఉ. నిదురా కంటికిరాద ది ♦ న్నివిధముల్ నే లోన చింతించినన్
ఎదయాయార్చుక పోవుచుం ♦ డెనుదిలోనా హెచ్చొయెయాయాసమున్
పదముల్ తొట్రిలుచుండె నా ♦ దు తనువున్ బారావహం బయ్యె
వదనంబున్ జెమటొప్పె తీ ♦ వ్రము గనా విభ్రాంత దాహాగ్నిచే.

చెలీ—నే మనుటయే కష్టముగా నున్నదే?

సీ. వనితరో నాకు జ ♦ వ్వన మంకురించియు
జతురాబ్దములు గూడ ♦ జరిగెనక్కటా
నాపెండ్లి యగుటకు ♦ నాతండ్రి నచ్చక
మంచిగ నన్నింట ♦ నుంచినాడు
నాధుడు లేనట్టి ♦ నాతిని నే నౌట
న్యాయంబె నీకునో ♦ యంబుజాక్షి.

రతికేళి సుఖములు ♦ నతివాంఛ జనియించె
జూపించి గూర్చునా ♦ జోటివాని
గీ. అతివ నాథుడు లేకుండ ♦ ననవరతము
దిరుగజాలను యీమోహ ♦ దిమిరమందు
ప్రళయకాలము లాగు ♦ ప్రపంచకంబు
బగుచున్నది నానేత్ర ♦ పద్మములకు.

నీవు నాకు పతిని గూర్చకున్న ప్రాణత్యాగము జేయుటకు సంసిద్ధురాలనై యుంటిని. తల్లీ! నీవు నన్నింత వేలవని పరిహసింపక మున్ను బాణాసురుని కుమార్తెయగు వృషాకన్యక యామె చెలికత్తెయగు చిత్రరేఖవల్లను తన మనోరథ సిద్ధిని పొందినటుల నీవు నీమాటల పాండిత్యమును జూపి నాకు నొక జక్కని యెమ్మెకాని సమకూర్చి నామనోరథ సిద్ధిని నెరవేర్చి నాప్రాణదానంబు జేయుము.

చెలి—ఇందిరా! నీమాటల పాటవముజూడ నాడెందమున కాంద్రోళనము గల్గుచున్నది. ఏమంటివా? తగిన రాచకన్యలు జారత్వమున పతులను సంపాదించుట కడు హేయకరమనియు, నిందాకరమనియు, నీచమనియు, ఘోరపాపమనియు నా యభిప్రాయము. ఏమందువా ?

సీ. తల్లిదండ్రులకును ♦ దలవంపులు ఘటిల్లు
నన్నదమ్ముల కెన్న ♦ జిన్నతనము
అక్క జెల్లెళ్లకు ♦ నపవాదములు గల్గు
ఆక్షేపణ మొనర్తు ♦ రతివలంత
జుట్టాలు వినినను ♦ జుల్కన జేయుదు
రిరుగువా రెరిగిన ♦ నీసడింతు్రు
గురువులు వినినను ♦ గులమున దొలగింతు్రు
జిన్న పెద్దలు గూడి ♦ జెడెపియందు్రు

సీ॥ పాడు జారత్వమున దిగుగు ♦ పణతి గూడ
విటులు గుక్కలవలె వెం ♦ వెంట దిరిగి
కుటిల కుట్రలు బన్నియు ♦ కూలిజేసి
ప్రాణములు దీతు రీవృత్తి ♦ పాడువృత్తి

గాన జారకృత్యమున భర్తను బడయుటకంటె నీ జనకుని జనువ్రున నొప్పించి నీసుందరమునకు దగిన సుందరాంగునకు నిన్నిప్పించి వైవాహికము జేయించెద తల్లీ! నీవు నామాట జవదాటక యింటికి జంటయే మంచిది.

ఇందిర—సఖీ! నీయూటలు నాజనకునివద్ద సాగిరావు. ఏమంటివా! నాకు వైవాహికము నొనరించిన నాభర్త ననుగొని పోవు ననియు నేను లేనిచో నిర్ధనుండ నౌదునని నొక దురూహపిశాచముచే పీడితుండై యున్నందున నామేనుగోరక నన్నానాథను జేయుచున్నాడు. తల్లీ! యింక నెట్లు జీవింతును.

గీ. పండువెన్నెల గాయంగ ♦ బవను వీవ
మరుడు విరిశరావళుల నా ♦ యురము నేయ
దాళజాలను విరహాగ్ని ♦ తాపమునకు
ఏమి జేయుదు చెలియరో యిపుడు నేను.

అహా! యీ ఘోరమారాగ్నియందు బడి మరణించుటకంటె నొక సుకుమారుని గూడి సుఖించుటయే శ్రేయమని నాయంతరంగము తొందరించుచున్నది. సఖీ! నీవు నాయందు మిత్రవాత్సల్యముంచి నాకోర్కెను దీర్చకున్న నీయెదుటనే యే నూతనో గోతనో బడి యసువులు బాయుదాన. ఇది నిశ్చయమని నీపర్మల మనంబున నమ్ముము.

చెక్రి—ఇందిరా! ఏమంత తొందరపడియెదవు. నీవు నిండు జవ్వనమున నుండుటచేతను యుక్తాయుక్తములు విచారించలేక తిరుగుడు పడుచున్నావు. నీవు అవివాహితవు గదా. పరపురుషుల

సాంగత్యమున గొన్ని యిడుములు దాపరించగలవు. గనుక నిదానించి కార్యము నెరవేర్పవలయును.

ఇందిర—నాకు నెన్ని యిక్కట్టులు సంభవించినను నేనే యడవుల బట్టి భస్మమైపోయినను నాజనకుడు నాకు వివాహము జేయడు. నానాథుని జూచుకో భారము నామీదనే యున్నది. నాప్రయత్నముకు అంతరాయము జేయక నాకు దోడ్పడి చక్కని ఎమ్మెకానిని కూర్చి నన్నుద్ధరించుము తల్లీ !

చెక్రి—(తనలో) ఈమె గట్టిపట్టే బట్టినది. ఇంక నేనూరకొనినచో మృత్యువాతంబడి స్వర్గారోహణంబు జేయునేమో! (ప్రకాశముగా) ఇందిరా! నీవింతగా నన్ను బ్రతిమాల వలయునా! నీవెంత మాత్రమును సందేహమును బొందక నీమందిరమునకు నేగుము. నేను నీయభిమతము ననుసరించి నాచాకచక్యమునంతయు నుపయోగించి నీకు దగిన వరుని వెదకి సమకూర్చెద.

ఇందిర—సఖి! ఇది సత్యమేనా ?

చెక్రి—ముమ్మాటికి సత్యమే! ఇదిగో నే వెడలుచుంటిని.

(నిష్క్రమించును.)

ఇందిర—(తనలో) ఇంక నాచెలి నాకు వరుని సమకూర్చుటకు నరిగినది. నే నిచ్చట నుండుట తగదు. నే నింటికి జనియెద.

(నిష్క్రమించును.)

## మూడవ రంగము.

స్థలం:—కమలాపురములో మందిరము.

ప్రవేశం—రామనాథం, హరిశర్మ హార్మోనియం మృదంగములతో

రామ—మిత్రమా! మన మెంతసేపు నిరీక్షించినను మన బలేరావు వచ్చినజాడయే యగపడకుండెను. అతడీపూట సంగీతమందిరమునకు రాడేమొ?

హరి— అతడిదివరకే వచించెను గదా! తన యిష్టమొచ్చిన చొప్పున వచ్చువాడనని.

రామ—సరియే! ఇంక నతనికొరకు ఎదురు జూచుటకంటె హార్మోనియమునకు శృతినిచ్చి యీవేళకు కాలక్షేపము చేయుదము. హరిశర్మా! ఏదీ నూతనము. ఈవరస యెరుంగుదునో! పాడుము.
(హరిశర్మ పాడును.)

రామ—గంధర్వాంశము లేనివానికి గానవిద్య యలవడదని పెద్దలు జెప్పుదురు. అందుచేతనే గానవిద్య కొందరికి గొంతుక చించుకొనినను గళకట్టదు. నేనును పాడెద. (పాడును) మిత్రమా! యిప్పటికి గానవిద్య మనకు చక్కగ నలవడుననని యాశ నాకు జనించినది. (పైకి జూచి) యిప్పుడు రాత్రి చాలా మించినదే.

గీ. రెండు యామము లయ్యెను ♦ జేయుమించె
శుక్రు డుదయించె చెదరెను ♦ చుక్కలెల్ల
నిదుర నేత్రద్వయము పైని ♦ నృత్యమాడె
హాయిగా బండుకొను సమయంబు గాదె.

కాన మనము రేపు బెండలకడ విచ్చేసి చక్కగా గానవిద్య నభ్యసింపవచ్చును. కనుక మనము శయనించుట మంచిది. (ప్రక్కలు వేసుకొని పరుండుదురు. రామనాథం. అటు నిటు గదలి, పైకి లేచి, ఏమిది నాకు నిద్దురయన్న మాటయే బట్టకున్నది.

గీ. అకట పెరచోట శయనింప ♦ నగునె నిద్ర
గన్నుమూసిన రాదయ్యె ♦ కమలజాండ
మంధకారంబు నన్నదోచె ♦ నడలె మనసు
గుక్కుటంబైన కూయదే గొ♦క్కు రనుచు.

ఇందుకే గదా! నిశాసమయము జారచోరులకు మిక్కిలి ప్రియమై, భూత ప్రేత పిశాచముల కాకరమై, వ్యాధిగ్రస్తులకు భీకరమై, గనుపట్టుచుండును. సకల బ్రహ్మాండమంతయు కాటుకబరణి కరణి జీకటి అన్నిదిశలను నిండియుండుటచే నెచ్చటను అలుకు డన్నమాటయే లేదు. సమస్త ప్రాణులను సుషుప్తిని బొందించి సకల చరాచర జంతుజాలంబుల జరించు నాసృష్టికర్తయొక్క చైదములు జెప్ప నశక్యములు గదా!

చం. దివమును రేయి సంధ్యల త్రి♦దేవుల వారి సమస్తలోకముల్
పవనుని నగ్ని నీరమును ♦ పావన పార్థివ ముఖ్యసంఘముల్
నవకళలొప్పు నరుని న♦నంతమునీకల నాకసంబులన్
జవమున నిల్పి నాశమును ♦ నల్పు మహాత్ముని నాశ్రయించెదన్.

ఆహా! ఏమి యీసృష్టి (ముందుకు జూచి) ఏమిది! ఇట్టి నిశయందు నేదియో వ్యక్తి యిటు వచ్చుచున్నట్లు బొడగట్టుచున్నది. ఏదియైన భూతమైయుండునా! లేక జారచోరత్వములకై సంచరించు హంతకులా! నిర్ణయించుటకు వీలులేక యున్నది. నేను కడు జాగరూకత వహించి నిర్భయముగా నీవ్యక్తిని గురించి యాలోచించెద.

చక్రి—(ప్రవేశం) ఆహా! ఎట్టి దుర్ఘటకార్యమైనను నాయికీమణులు జేయు మన్నపుడు దూతికలకు జేయుట విధియైయున్నది. నేను దొలియామముననే నాకు పరిచితుండైన రామనాథం యింటి వద్ద నున్నాడని యెరిగితిని అతను సంగీతమందిరమున నిరువురు మిత్రులతో నున్నట్లు దెలిసినది. కాని సంగీతమందిర మెచ్చట నున్నది గుర్తించజాలకున్నాను. ఎటు బోవుటకు జీకటిచే జర

ణంబు లాడకున్నవి. అన్నిటికిని దైవమే గలడు. అయినను నీగృహ మెవ్వరిదై యుండునో? (ముందుకు నడచును.)

రామ—(ముందుకు జూచి). ఎవరువారు ఈయర్ధరాత్రియం దిచ్చటికి రాగతంబేమి?

చెక్రి—ఆర్యా! నేనొక పరిచారికను.

రామ—ఏమీ! నీవు పరిచారికవా! అట్లయిన నీపేరేమి?

చెక్రి—చెక్రికేళి.

రామ—ఓసీ! చెక్రికేళీ! నీవెవరవో యని యాలోచింతిని. ఇటురా! ఎవనికోసమే నిసిని దిరుగాడుచున్నావు

చెక్రి—నేనొక విటశిఖామణికోసము దిరువీధులు దిరుగాడుచున్నాను.

రామ—ఎవ రాతను.

చెక్రి—రంగైన రామనాధము.

రామ—ఏమిది! నీమాటలు బట్టిజూడ వింత గొల్పుచున్నవే. నేనే రామనాధమును నావని యిప్పుడేమి వచ్చినది.

చెక్రి—మీవని యుండఁబట్టియే! దిరువీధులు దిరుగుచున్నాను.

రామ—అట్లయిన నీవసారలో విశ్రమింతము రమ్ము. (ఇద్దరు కూర్చుందురు.)

రామ—చెక్రికేళీ! ఎంత సాహసురాలవు.

ఉ. రాతిరి చాలమించె నెదు♦ రాడు మహోగ్రహ ఘోరకామినుల్
భూతములెల్ల నీవెనుక ♦ భూరిభయంకర గర్జనంబులన్
భీతిగలంగ సేనిపిని ♦ భీతమృగాక్షిణ నాదు బాధమే
రీతిని జేరితీవు భళి ♦ రేయిల నెంతకు జంతకారివే.

చెక్రి—ఈవగచుటకేమి గాని, మీకు గలసివచ్చే గార్యముండుటం జేసి దెయ్యమనక, దేవరనక, చీమనక, పామనక, చీకటనక, చిట్రినక, మిమ్ము గురించి యిన్నికష్టముల బాలైతిని. ఇక ముందు నెన్నికష్టములు పొందివలయునో గదా.

రామ—అట్లయిన నన్ను గురించి మహాకష్టములు పొంది జెప్పవచ్చిన గార్యమేమిటో ! వినుటకు నామనంబు దొందరించుచున్నది

గీ. జెప్పు జెప్పుము బేగ యేమొ ♦ జెవుల కెల్ల
వినగ దొందర గల్గెను ♦ వేగకయ్యొ
నాలసింపక యమృతంబు ♦ గ్రోలు నటుల
గలసి వచ్చేటి పని జెప్పు ♦ గంబుకంఠి.

చెక్రి—(తనలో) ఈతడు సంగతంతయుకే మిక్కిలి దొందరగా నడుగుచున్నాడు. జెప్పుటకిదియే సమయము. (ప్రకాశముగా) ఆర్యా ! అపవాదుని గూతురు. ఇందిరను మీరు రెరుగుదురా !

రామ—ఎప్పుడు నామెనంతగా వీక్షించియుండలేదు. కాని యామె పనే మెచ్చినది.

చెక్రి—ఆమె యొకపిచ్చి యూహ దలపెట్టినది.

రామ—ఆమె దలపెట్టిన యూహ యేమయి యుండును.

చెక్రి—ఒక చక్కని ఎమ్మెకానిని గోరి సుఖించుటకు.

రామ—అట్లయిన నామెసొగసుకు దగిన సుందరులీ ధరాతలంబున లేరా ?

చెక్రి—లేకేమి ! యుందురు. ఆమెసుందరమునకు దగిన సుందరుం డుండిన బరసవేదికి బరిమళ మబ్బినట్లుండునని.

రామ—ఏమియా మగువ యంతసొగసు కత్తియా ?

చెక్రి—సొగసని సోద్యముగ నడుగుచుంటిరా ?

గీ. ఇంతి గాదది జాళువా ♦ బంతిగాని
కన్నె గాదది కనకంపు ♦ కాంతికాని
భామ గాదది షోడశ ♦ భవ్యకళలు
బరగుచున్నట్టి చెంద్రి ♦ బింబము గాని.

రామ—(తనలో) ఆహా ! ఇట్టి సురదూర్భిణి యగునా యన్నుల మిన్న నెట్టి మానవునకు లభించునో ! ఆతనిదే మహాభాగ్యము. (ప్రకాశముగా) చెక్రికేళీ ! ఎరుగక వదింపుచుంటిని.

ఆమె జనకు డింతవరకు కామెను వరుని నిర్ణయించి వివాహ
ము జేయకపోవుటకు కారణ మేమయియుండెనో ?

చెక్రి—కారణమున కేమున్నది దగిన సంబంధములు దొరసిలక
పోవుట దొరసిలిన సంబంధముల కామె యొప్పుకొనక బో
వుట ఇవియే.

రామ—సంబంధముల కేమిలే ఇప్పుడు సంబంధములందు నంత పట్టు
లేదు. ఏమంటివా ?

సీ. మహారాజు తనయను ♦ మకుమరకల కిచ్చి
పెండ్లిజేసి బులావు ♦ బ్రీతిమెక్క
బ్రాహ్మణుం డొక్కడు ♦ బటుక్షత్రియుల బిల్ల
బెండ్లాడి బూరెలు ♦ బ్రీతిమెక్క
వైశ్యరత్నం బొంకు ♦ వేశ్యల బిల్లను
బెండ్లాడి బులిహారి ♦ బ్రీతిమెక్క
వండాలకులు డొక ♦ చండాలకన్యను
బెండ్లాడి బూరీలు ♦ బ్రీతిమెక్క

గీ. వర్ణనాలు జేసి గులముల ♦ నెడ్డిమూన్చి
నింక గులముకు గూడుకు ♦ నిగ్గులేదు
నచ్చినటువంటి పురుషు ♦ నానందముగను
నాతి వరియింపవచ్చు నా ♦ నాముకాంత.

చెక్రి—ఎట్లయిన నాడపిల్లలు గురించి మంచిచెడ్డ లరయవలదా ?

రామ—అట్లయిన నీయభిప్రాయమేమి ?

చెక్రి—గీ. సుందరంబైన వానికి ♦ సున్న విద్య
విద్య గలిగిన వానికి ♦ సుందరంబు
సున్న రెండును గల్గిన ♦ సున్నగులము
మూడు గల్గినవాడె యా ♦ ముగుదవరుడు.

ఈమూడుగుణంబు లెవనియందు వర్తించునో యాతఁడే యాఁగుసుమ
గాత్రి మగఁడని యెఱుంగుము.

రామ—మూఁడుగుణంబులున్న జాలునా! అన్నిటికంటె నగ్రస్థాన
మలంకరించు ధనముండవలదా ?

చెక్రి—ధనాశాపరుఁ డామె జనకుఁడుగాని యామెకు నిమిత్తములేదు.
గావలసినంత ద్రవ్యము నామెయే యిచ్చును.

రామ—అట్లయిన నామందయానను నావశము జేయరాదా ?

చెక్రి—చేసిన నగిక్రింద బ్రవేశించు బండికొక్కువలె నామె ధన
మంతయు దాటింతువు గాబోలును.

రామ—ధనమున కేమిగాని యిరువురు మనములు నొక్కటై చెలఁగ
వలెను.

చెక్రి—మనములే గావు యీయిరువురు గలసిన నెట్లుండునో నేవచించెద.

సీ. మంచి బంగారపు ♦ మధ్యభాగంబున
చెలువైన రత్నంబు ♦ చేరినట్లు
శతపత్రములు గల్గి ♦ సలిలపూరితమైన
గొలనందు గలహంస ♦ గ్రుంకినట్లు
నల్పశిల్పములచే ♦ నతి సుందరంబైన
శివుని దేవళమున ♦ శిఖరమట్లు
పూలవిల్తునిచేత ♦ బాల్పొందు వల్లికి
ఫలము లుత్పత్తియై ♦ బరగినట్లు

గీ. శుభ్రబంజరమందు నా ♦ శుకముపోల్కి
కోఁచూతంబుల దిరుగు ♦ కోకిల గతి
బువ్వుల దిరుగాడు భృంగంబు ♦ పోలినెపుడు
నుండు నాకాంత నీచెంత ♦ నుండునపుడు.

రామ—సరియే గాని యీయామె పూజ్యమైన గుటుంబమున జన్మించి
యెట్టి అపూజ్యమైన నూహదలపెట్టినది. ఆహా! ఎట్టి మరి

యాదవవంశమును మన్ను గల్పుచున్నది.

చెక్రి—(తనలో) ఏమిది యితడు మా రెత్తులోనికి దిగినాడు. నా ప్రయత్నమున కంతరాయము రాదుగదా! ఎట్లయిన నీతని హృదయము త్రిప్పి నా కార్యము సఫలము నొందించెద. (ప్రకాశముగా) మున్ను రుక్మిణీదేవి, వృషాకన్య, నర్మద మొదలగు రాచకన్యలు మరియాదను మన్ను గల్పి వారిచెలికత్తెలవల్లను, కార్యసాఫల్యములనొంది భర్తలను బడయలేదా ?

గీ. బాణుకూతురు మరియాద ♦ బరగవిడచి
కృష్ణుకొమరుని బెండ్లాడి ♦ తృప్తిపడదె
భీష్మకూతురు రుక్మిణీ ♦ బిరుదువోల
గోపకృష్ణుని వరియించి ♦ గోరిచనదె ?

ఇంకను నెందరు యువతులు తల్లిదండ్రులను, సహోదరులను నెదిరించి భర్తలను బడసిరి. ఈమెయే మరియాద మన్ను గల్పుచున్నదనుట ఎంత యవివేకము. ఎంత బొరబాటు.

రామ—నీ వాసుందరిని నాకు గూర్తునంటివే. ఆమెను నేను జారకృత్యమున నంగీకరించుట కంటె —

గీ. తగిన పెద్దల నంపించి ♦ తండ్రి నడిగి
తండ్రి యనుమతి నామెను ♦ ద్వాహమాడి
యందరా నందమొంద ♦ నాయబ్జముఖిని
గూడి సుఖముల నందంగ ♦ గోర్కె నాకు.

చెక్రి—అబ్బో! ఆపని ఎప్పుడును సాగదు. ఏమంటివా! ఆమెతండ్రి కడు క్రూరుడు, అతినీచుడు నీకు నా కుసుమగాత్రి నిచ్చుట కాత డంగీకరించడు.

రామ—అట్లయిన జారత్వనాటక మాడుమనుచువా ? ఆడినచో నెట్టి ప్రమాదము సంభవించునో యని నామనం బడలుచున్నది. ఏమంటివా ?

చం. తన జనకుండు, సోదరుడు,♦ తాతయు, మామయు బంధువర్గముం
ఘనమగుశూరులంచు విని ♦ గంటి నిదానభయంబు గల్గె నా
ఘనకుచ నాకు గూర్చ నవ♦ కాశము నీకెటు గల్గనేర్చునే
వనితరో నీకు, నాకు గడు ♦ వంతప్రయాస సంభవించెమన్.

చెక్రి—నీవు నాశూరశిఖామణులకు నిసుమంతయు జంకనక్కరలేదు. నేనే మాయిరువురకును సంఘటన జేసి మాయిరువుర మధ్య నొక చక్కనిరంగము నడుపుదును.

రామ—చెక్రికేళీ! న న్నిపని కొప్పుకొమంటివా ?

చెక్రి—నిస్సందేహముగా నొప్పుకోవడమే నాయిష్టము.

రామ—సరియే! ఆయొప్పులకుప్పను నెప్పుడు గూర్తువు.

చెక్రి—ఎప్పుడో నా, రేపురాత్రికి నిపజ్జగూర్చెద. రాత్రి యెంతో లేదు. నే నింటికరిగెద.

రామ—మరచితి. ఈమందిరమే సంకేతమందిరముగాన నిచ్చటికే నాచపలాక్షిని దోడ్కొనిరా.

చెక్రి—సరియే (నిష్క్రమించును.)

రామ—నామిత్రుడు మైమరచి గాఢపారవశ్యుడై నిద్రించుచున్నాడు. లేపి నావెంట తోడ్కొని పోయెదను.

(నిష్క్రమింతురు.)



# గుండెగుభేల్.



## ద్వితీయాంకము



### ఒకటవ రంగము.

స్థలం:—కమలాపురం వీధిలో

ప్రవేశం:—మల్లిగాడు.

పాట:— చూప్ । నాతో సమచోరున్ । యీ ఆఫ్ యిండియాలో । ఏప్మీర నేనే నేనంటే । ఏము భ్రాంకులకు । ఏక కన్నమే॥ చూప్.

2. మొండిన్, బండన్ దండిమగలవే । ఖండల్ జీల్చేద । చండ శాసనుల గుండెల్ దీతును॥ చూప్॥

3. నాకు వొళ్లస్ నాగోటన్ పోటుదు । మేటిపత్రికల మూటల్ కొసురుదు । ప్లాటువేస్తినా । బాటల్ గట్టడు॥ చూప్॥

4. అధికారుల్, గధికాగుల్ । నాపేరంటే హడుల్ బుట్టె । అల్లావచ్చి మానమే । అడుగిడగలరే । బరుగిడగరే । దడల్ దడల్ [illegible] గుండెభేజారే॥ చూప్॥

నేను బందిపోటు యుంచేసంటే బమ్మదేముడైన భయపడి నా బాదా లట్టవలసిందే దోవలో గాసి దొరికించుకున్నానంటే నెంతటి సామంతుడైన సచ్చేడన్నమాటే నాగొప్ప నే జెప్పకో గూడదు జెప్పకుంటె బ్రమ్మకైనా తెలంలేదని మాకందికట్ల అప్పిగాడు

కిల్లాడ క్రిష్టిగాడు, పిల్లి యీరిగాడు, నల్లినరసిగాడు, పెద్దోళ్లు గందా అళ్లు జెప్పి జెప్పినమాటలు అచ్చరాలా జరుగుతాయి. ఏంతంటే మరాటురయి ఢ్వేరికంపెనిలో ట్రింకుల్లు సూట్ కేసులు ఎన్ని నాహస్తగతమై ఆకాశమార్గమున కేగినవో లెక్కయే లేదు. పెద్ద పెద్ద వుద్యోగస్తులు యిండ్లలో దూరి స్వర్ణరజతపాత్రంబులు నా చేతిబడి చిటికిగొట్టి చివ్వపిణకలందు దూర్చితినో చెప్పలేను. సూట్ బూట్ కోటులేసుకొని శాజారు కెళ్లు బలవంతుల జేబులనుండి నెన్ని కరీంసునోట్లు నా చెయ్యి జిక్కి నెగిరి గెంతులేసి సాగాకొట్లను సంతోష పెట్టినవో! అంతమే లేదు. నేనెరుగని జైలులేదు. నేనెరుగని నూరులేదు. నా అసహాయ చోరత్వానికి నాబలిమికి మెచ్చి పోలీసుశూవర్గంటుధొరవారు చోరాగేసర చక్రవర్తి యనియు కలియుగభీమన్న యనియు నాకు రెండుబిరుదము లొసంగిరి. నాబిరుదములవల్లను షడ చక్రవర్తులలోను పంచపాండవులలోను దూరితిగదా యని మొదవిద్దె దొంగిద్దె మానుకుంటె కులవృత్తికి పాటిరావు గున్నలచెన్నా అన్నట్టు ఎవ్వరు కులవృత్తి మానుకొన్నానో యప్పుడే కూటికి కరువొచ్చి నోటికికుచిదగ్గింది. (తుల్లిపడి యిటునటు జూచి) ఓరబ్బో వాఎల్లిగాడు లాగున్నాడు. ఎంసెప్తె యీలా గొత్తున్నాడు. యీడికేదయినా యినికిడయింధేమో ఓరోయి ఎల్లిగా పిల్లినాగ ఎక్కడకేస్ మెలుతున్నావు.

ప్రవేశం:—యల్లిగాడు.

యల్లి—మల్లిమామయ్యా మీయింటి కెల్లేసు మాఅప్ప నీవు పోయేవంది. నీ నడిపట్టుకొని యిక్కడకొచ్చెను. తెల్లారతే తాగడానికి గెంజిలేక గించుకోవాలి సరిగందా చుట్టముక్కైనా లేదు. ఏదైనా దొరక్కపోతుందాయని యీసంములంట, ఫుంతలంట, గంతలంట పేనాలు చేతటుకొని తిరుగుతున్నాను. నావున్నం

వల్ల నీవగపడ్డావు. మాయ్యా నీపాదాలట్టుకుంటాను నన్ను రచ్చించాల. (అని కాళ్లమీదబడును.)

మల్లి—ఒరే యల్లిగా నీపడుపింతే మొన్నసందజామున సంతకెల్లి వత్తున ముత్తయ్యగారి ముసలమ్మ మెళ్ళోవట్టెడలాగితే పట్టుకొని నిన్ను చితకజంపి విడచేరు యదవ దెబ్బలుదిని రావడమే గాని గుడ్డిగవ్వ దేలేవు. అదిగో! అపక్క నేడు యెవరో అరుగుమీద తలకాడమూటెట్టుకొనితొంగున్నాడు. అమూట నెగరైనే నిక్కడుంటాను.

యల్లి—(వెళ్లి మూటట్టుకొనివచ్చి) యిదుగో మాయ్యమూట.

మల్లి—సరే పట్టుకో యీ ఏలకు బగవంతుడు యిద్దెట్టేడు. ఓరేయి యల్లిగా యీ యాల మనయూరిలో చిన్న చిత్తరం జరిగిందిరా?

యల్లి—ఏంటేసి సిత్తరం.

మల్లి—తిలనాసికంగారి యింట్లో పిల్లవుండే! ఎరుగుదువా! ఆపిల్లను మృత్తికేసుగారి పిల్లోడు పీకులాడేడంట.

యల్లి—ఓరిబాబ్బొ! అందుకోసమే గాబోలురా! అడావిడిగా తిలనాసినంగాడు. ఆరిని యీరిని అట్టుకుంటన్నాడు

మల్లి—యీడితల్లి సిగ్గొయ్యా! తిలనాసినంగాడి తిప్పలు ముందున్నాయిరా! ఏం అడిగినా యీడిముఖాన్ని చుట్టముకైన బుట్టదు. సరిగందాముకైనా బెట్టడు.

గీ. చుట్టమునకైన నివ్వని ♦ దెట్టవెధవ
గడ్డిపరకకు గొరగాని ♦ గుడ్డివెధవ
జెడియు బ్రతికిన ఛండాల ♦ భడవపీకు
కాని జూచిన ముద్దిడ ♦ గాగనొప్పు.

యల్లి—మల్లిగా యీతిలనాసకంగాడి యింట్లో! అత్తి ఏమయినా వుందిరా?

మల్లి—లేకేం యీమధ్యనే కొంతి కొంతమంది ఆత్తులుగలసి పిలకెగ కేత్తూ, కిలకేత్తున్నాడు.

యల్లి—అలాగైతే యీడ్ని అకరుజెయ్యాలరా ?

మల్లి—యిప్పుడుగాదు యికముందు.

యల్లి—మల్లిమాయ్యా మన మొచ్చిన పని మరచేము రాత్రిచాలదు. రామిశెట్టి పనిబట్టి యీ రేసు యింటికెల్లాల.

మల్లి—ఓరబ్బో ! మాటలో వుందనుకున్నావా ! మనపని అన్ని వకులలోకి మనపన్నియే కష్టం.

గీ. తే. చీమ చిటుకనకుండ ♦ దోమెగరకుండ
మనుజు లెగకుండ జనములు ♦ మసలకుండ
కాలుచప్పుడు గాకుండ ♦ పీలుజూచి
కన్న మెయ్యాల గాకుంటె ♦ కానురాదు.

యల్లి—మల్లిమాయ్యా మనపనంత బడవా పనిలేదు. దిన దినగండం నరిగందా రత్తకూడు దినాలి.

ఆ. బల్లివలె గోడలంటును ♦ బ్రాకవలయు
బిల్లిలాగున పొంచుండి ♦ మెలగవలయు
నల్లిలాగున మెల్లగా ♦ నడువవలయు,
గొల్లుమనకుండ గోతముల్ ♦ గోయవలయు.

ఎంతకట్టం, ఎంతకట్టం దొంగపనంత దొమ్మరిద్దె లేదుగందా ఎరుగని ఎర్రివ్వలు దొంగోళ్ళు దొంగోళ్ళంటారు. సీకృష్టమూర్తే దొంగోడు యీశ్వరుడే దొంగోడు యీనాయికుడే దొంగోడు యీరప్ప దొంగోడుగందా దొంగోడుగానోడెడీ అంత గొప్పోడుకన్నా నెల్లికన్నా. నొచ్చే మా తాత సుబ్బడు సూచేడంటే యీవరాలమూలైన ఎగిరిం దన్నమాటయే మనపెద్దోళంతా దొంగోళ్లే సూస్తే ఆసికం సూడకపోతే పరాసికం అంతా.

చేదెబ్బగొట్టేవాళ్లే దుదకు అంతా మనోళ్లే హిహిహి (అని నవ్వును.)

మల్లి—ఎల్లిగా ఏడ్చేవుగాని ఏదో చప్పిడాతుంది మాట్లాడకురా! నిదానించి ఎల్లిగా మనవున్నొంబాగుంది మన బయిలెల్లిన యేల బేవన సుబ్బన్నగారెట్టిన మూర్తం మూర్తం అంటే ఆయన గోరేపెట్టాలి పెట్టేడంటే అయిందన్నమాటే.

గీ. కన్నమేయుట మనకెంతొ ♦ కష్టమనుచు
కరుణగల్గియు నల కాళి ♦ కాంబ నేడు
మనకు నెదురుగ బంపెనా ♦ మగువజూడు
మేనబంగారు తొడవులు ♦ మెరయుచుండె
పూచి నటువంటి తంగెడ ♦ పోలుపుగాంచె.

ఆహా! నెన్ని వత్తువులు ఎన్ని వత్తువులు కళ్లుమనిగిపోతున్నాయి.

యల్లి—ఓరోయి! మల్లిమాయ్యా యిటుజూస్తే కమ్మనికల్లు అటు జూస్తే పిల్లినగరిలాంటి పిల్ల. ఏంశేద్దామురా కష్టమొంచిది.

సాంగు.

మల్లి—ఎందుకుర యీకట్టము మన । కెందుకుర యీకట్టమూ ।
ఎందుకుర యల్లిగా । యిందూవదనలాంటి । సుందరో
త్తున్నాది । గొందిలోకి లాగి సందిటబట్టరా॥ ఎందు॥

యల్లి—మాయ్యా! మాచక్కనిగల్లు అదిగో! అదిగో! పాక.

2. మనతల్లి మరిడమ్మ । మాతువల్లను మనకు । యీతకల్ లం
గడి చేతికిదొరకేను । ఏతామెత్తి మనము యీతొత్తు బడ
దాము॥ ఎందు॥

మల్లి—ఓరే! యల్లిగా కల్లుకోసం ఆసించేమంటే పిల్ల ఎల్లిందన్న మాటే అదుగో చూడరా!

3. వల్లెల్ల నగలుతోటి। వయ్యారమున గుల్కు । నల్లనావచ్చెటి
పిల్ల నట్టుకోని । బుల్లిరమనువూని । బూటకమెయ్యాల॥ ఎం॥

యల్లి—అదిగో వత్తావుంది. దీనితల్లి సిగ్గొయ్య యిది యెక్కడికి కెల్తా దో దీని సిత్తరమేమిటో యీచాటునవుండి జూదాంరా.

(అని చాటున దాగుదురు.)

స్థలం:—సౌధాంతరమునుంచి గ్రిందికి దిగి.

ప్రవేశం:—ఇందిరాభాయి

ఇంది—అహా! అన్ని పనులకన్న జారత్వ మెంతకష్టసాధ్యమైన పని. ఎంత దారుణమైన యుద్ధము యొంతకష్టసాధ్యమైనది. ఈజారత్వము యెవ్వ రేమనుకొనినను యెంతనుంది ఛీ ఛీ యని నను జిన్నతనమును భయమును నీవృత్తికి పరాన్ముఖులౌ చుందును గదా.

గీ. పరగ బ్రహ్మాండమంతయు ♦ బ్రద్దలైన
భూతభేతాళము లునిసి ♦ భూరటిలిన
సతము చోరులు దిరుగాడు ♦ సమయమైన
జారకాంతకు భయమన ♦ జగతి గలదే.

(రెండడుగులు నడచి) ఛీ ఛీ యీఆడజన్మముకన్న పాడుజన్మము మరి లేదు గదా. అన్నిపనులకు భయమే పొందవలయును.

గీ. నిన్న రేయిని నాచెలి ♦ సన్న సన్న
జప్పిడవకుండ సరసుని ♦ జాడజూపి
రతుల నొందంగ దనిపి వే ♦ గతుల జెలిమి
మాకు నమకూర్చి యానంద ♦ మొంగజేసె.

అట్టి నాప్రియమైన నెచ్చెలిని విడచివచ్చుటచే నాప్రియుకాని మంది రము గుర్తించజాలకున్నాను. ఎటు బోవుదమున్నను జరణంబు లాడకున్నవి. (తనలో) ఎవ్వరో నిరువురు నిటే వచ్చుచున్నారు.

వీరి కంటబడిన నాకెట్టి యాటంకము గల్గునో గాన నాజంట సౌధముజాటున దాగి నవశలకు దాపెద.

(అని నిష్క్రమించును.)

---

ప్రవేశం:—దొంగలు

మల్లి—(చూచి) ఓరబ్బో! యిదేరా బాబు అపవాదుని కూతురు మంచిరం గేళిరా! అంగుజూపుటకు వచ్చినది గాని కంగారు పడుచు నాజంటసౌధములచాటున మాయైనది.

యల్లి—సరే మాయ్యా! సమయం దొరికింది దీనిని బోనీక యొడలి నున్న తొడవులు నపహరించి నడవుల బట్టించెద.

మల్లి—యల్లిగా రాస్ దీనిని బట్టికొందము.

(అని నిష్క్రమింతురు.)

ప్రవేశం—ఇందిరాభాయి.

ఇంది—ఆహా! ఎన్నివీధుల దిరుగాడినను, నావన్నె కాని మందిరము గుర్తించ లేకపోతినే, నారమణుడు రామనాధ మీరాత్రి నాకై నెంత పరితపించుచుండునో గదా? ఇంక నేనెట్లు నామనో నాధు మనోరథము దీర్చ గలుగుదును. ఏమిసేతును, పోనీ మా మందిరమునకు మరలిపోదమన్నను, మార్గము దెలియరాకు న్నదే. (ఆకసము వంకజూచి)

గీ. ఆకసంబున తారలు ♦ నన్ను బోలి
దిరిగి వేసారి దనపతి ♦ దెలియుకొరకు
నరుగుచున్నారు నేనిట ♦ నిల్వదగునె
ప్రియుని నెడబాయు ను విడల ♦ పాట్లునివియే.

(అని రెండడుగులు నడచును)

ప్రవేశం:—దొంగలు యిరుప్రక్కల నిలుచుందురు.

ఇంది—(తనలో) వీరెవ్వరో! ఇరువురు నాయిరుప్రక్కల నిలుచున్న వారే హంతకులై యుండనోపుదురేమో? అయినను బల్కరించి జూచెద. (ప్రకాశముగా) అన్నలారా! మీ రెవ్వరో నెరుగం జాలకున్నాను.

మల్లి—ఏమీ! ఎరుగవా, మే మా మధ్యవర్తులం.

ఇంది—అయ్యలారా! మధ్యవర్తులంటే మందబుద్ధిచే తెలియ లేకున్నాను.

యల్లి—యాంటీ దెలలేదు మేము సందకాడ, తెల్లారగట్ల కనపడం మద్దిగావుండే రెండురుఝాముల రేతిరికాడ.దరిగే మధ్యవర్తులం.

ఇంది—(తనలో) వీరు చోరులవలె నగపడుచున్నారు. దారితప్పితినే నేనేమి జేయుదును. (వణుకుట నభినయించి) మీరు చోరులా?

మల్లి—అరిమే మేము.

ఇంది—అయ్యో! నేనేమి జేయుదును. ఏది దిక్కు. హా పరమేశ్వరా! సకల దిక్కులు నిండినవాడవు. నాదిక్కు లేవా? హా జననీ! హా జనకా! మీ కనుమొరగించి మీ కపకారము గావించిన యీదుష్టురాలిని గాపాడరా! నన్నీసీచులు చుట్టిముట్టి గొంపోవ నుంకించుచున్నారు. రక్షింపుడు. రక్షింపుడు

మల్లి—ఓ రేయ్! యల్లిగా యీపిల్ల గొంతుకెత్తి విలపిత్తుంది. పీకట్టుకొని నొక్కేసి.

యల్లి—ఓ పిల్లోయ్! నీ వల్లరిజేసేవంటే, నీ వల్లుసితికిం దన్నమాటే యిదుగో! దుడ్డుగర్ర (అని కర్ర జూపును.)

మల్లి—కిక్కురుమన్నావంటే నాకిర్రెక్కిజూచేవా! సర్రుమని నీ బుర్రెగిరిపోతాది. తియ్యి తియ్యి నీపంటి వస్తువులు, అక్కడెట్టు అద్దరేతిరికాడ ఆలిపెళ్ళాని యిడచిపెట్టి తిరగడానికి సితాతకచ్చోన్నామనుకున్నావా!తియ్యితియ్యివస్తువులు తియ్యి

ఇందిర—అహా! ఎట్టు యీవిపత్తును దాటగల్గుదును. ఏది తెరవు.

సీ. అయ్యయ్యో నెంత • యసహాయ నైయుంటి
గాపాడరే మీరు • కాపులారా
గన్యను నను మీరు • గరుణించి బ్రోవరే
గరుణ గల్గిన • గ్రామకర్తలారా
దిక్కు లేనట్టి యా • దీనురాలిని బ్రోవ
సమయంబు మీ కిది • సరసులారా
నాతిని ననుబట్టి • నరుకంగ చోరులు
దలపెట్టి యున్నారు • దాతలారా

గీ. నన్ను గరుణించుటయు మీకు • నష్టమనుచు
ఎంచియున్నారె కీర్తి కా • సించలేదె
మించకుండగ నన్ను • మన్నించలేరె
ప్రాణ మిడనున్న దాన నా • ప్రాపుగన రే.

హా! రక్షింపుడు. రక్షింపుడు. (అని భూమిమీద బడిపోవును.)

ప్రవేశం:—బలేరావు, పిస్తోలుతో.

బలే—(తనలో, యీ అర్ధరాత్రింబున యీ ఆర్తధ్వని యెవ్వరిదైయుండును. (ఆలకించి) ఆ తెలిసినది. ఇదియొక స్త్రీకంఠధ్వనివలె గోచరింపుచున్నది. ఎవ్వతైన యువతి చోరులకు జిక్కియుండలేదు గదా? (ప్రకాశముగా) అదిగో! దుర్మార్గులగు దొంగలు యొక్క వికటట్టహాసములు వినవచ్చుచున్నవి. ఇంక నేనాలసించుట ధర్మముగాదు. త్వరితగతిని నా చోరుల కాలసదనంబునకు బంపి నాకాంతామణి జెర విడిపించెద.

ఉ. అరరే హంతకులార పర్బి నిటులన్ అన్యాయంబుగా నింతిన్
కరవాలంబుల ద్రిప్పి జం • కు కరుణా వేశంబు లేకుండ యీ
వర పద్మాజనన జంప నీ • విధిని మీరల్ జూచుచున్నా రేనా
కరపిస్టల్లున మీ సిరం • కరము గుండెల్ ఖండలున్ జెండెదన్.

ఓరోరి! హంతకులారా! పారిపోకుడు, నిలుడు. నిలుడు. మీ శిరం బులు తుత్తునియలు జేసెద. (అని పిస్టలుతో గొట్టును. దొం దొంగలు పారిపోవుదురు:— బేటరీలైటువేసి జూచి). చోరు లేరీ యీనారీమణి భూమిమీదబడి యుండుటకు గారణ మే మయియుండెనో! (నిదానించి) అయ్యో! యెంత పొరపాటు పనిజేసితిని. భ్రమవశమున నీపిస్టల్ దెబ్బ నీసుందరాంగికి నాటలేదు గదా. ఎంత దారుణమాచరించితిని. ఎట్టి స్త్రీ హత్యకు పాల్పడితిని. (చేత స్పృశించి) హరి హరీ! ఈనారీమణి మేనప్రాణంబులు పాసెనే.

శా. అయ్యో యెంతటి ఘోరకృత్యమును మద♦న్నాలోచనల్ లేకనే
చెయ్యం బోయినవాడ నిట్టి జడుడే ♦ జన్మంబు నందుండునే
న్యాయాన్యాయము మంచిచెడ్డలును గా♦నంరావు గోపంబుచే
పాయంజాలదు స్త్రీల జంపిన మహా♦పాపంబు నెవ్వారికిన్.

ఇట్టి ఘాతకకార్యము జేసిన నాకెట్టి రౌరవాదినరకము సంప్రాప్తిం చునో గదా. చోరుల రూపుమాపనెంచి నారీమణిని గూడ మట్టుబెట్టితినే. ఈమెకు నాపిస్టల్ దెబ్బ నెటనాటినో జూచెద గాక. (ఇందిరను దడవిచూచి.)

గీ. వనితముఖమును బోలునా ♦ వనజవైరి
గలువలను మించె గలకంఠి ♦ కన్నుగవలు
మేనుగాంతియు నిసుమంత ♦ మాయలేదు
మరణ చిహ్నములేద యీ ♦ మగువ కిపుడూ.

బలే—(నిదానించి చూచి) యీమె నాసా పుటంబులనుండియు మెల్ల మెల్లగా నిట్టూర్పు లిచ్చుచున్నది. సజీవయ్యై యున్నట్టు తోచుచున్నది. చోరుల దాపిడికిని నాపిస్టల్ నఖండధ్వనికిని గుండెగుభేలుమని మూర్ఛమునిగి యుండవచ్చును. సరియే నేను యీమెను సేదదీర్చి నీమె నిజవృత్తాంత మరసెద.

(ఇందిరశిరంబు తొడమీద నిడుకొని విసరుచు) అహా! స్వప్రహ దప్పినను యీమెసుందరము దెసలావరించుచున్నది ఇంత జక్కనిచుక్కవంటి జక్కెరబొమ్మ జోరుల కెట్లు జిక్కినదో తెలియదు. కాలవైపరీత్యముల బట్టి నెట్టిఘోరములు జరుగుచున్నవి. ఈయన్నుల మిన్నను జూచినగొలది నా కొకవిధమైన జాలియు, ప్రేమయు, మోహమును గల్గుచున్నది. అహా! నీమె త్రిలోకసుందరి యనుటకు నీమెముఖపద్మమే జెప్పుచున్నది.

సీ. పూర్ణచంద్రుని కంటె ♦ బాలు పొందు వదనంబు
మద్దిడ నాకెంత ♦ మోహమయ్యె
బంగారు గలశల ♦ భ్రమగొల్పు గుచముల
హస్తంబులను బట్ట ♦ నాసయయ్యె
బింబఫలంబును ♦ బెదరించు నధరంబు
బట్టి యానుట కెంతొ ♦ భ్రమయునయ్యె
దొలకరి మెరుపును ♦ దొలగద్రోచిన మేను
గాగలింపగ నాకు ♦ గోర్కెనయ్యె

గీ. ఔర యీయింతి యందంబు ♦ నరసిజూడ
రతియొ రంభయొ లేక యీ ♦ రమణియల్ల
మేనకయొ ఘృతాచియొ యేమొ ♦ గాని నేడు
మూర్ఛమునిగియు నాకెంతొ ♦ ముదము గూర్చె.

నే నెంత శ్రమపడియించి విసరినను నీమెమూర్ఛ దెలియ లేకున్నది గదా. ఇంక నేనేమి జేయుబాడ నేనెట్టి యుపచారములు గావించినను దెలివియే రాకున్నది. ఈసుందర ముఖారవిందము జూచిన గొలది విడచిపోవుటకు గాళ్ళాడకున్నవి. ఇంక నేమి జేయుటకు దోచకున్నది. (విచారించి) సరియే! ఈసుమగాత్రి నోట నిసుమంత నీరములు నిడిచూచెద. (ఇందిర నోటను నీరిడును యిందిర నటు నిటు గదలును.) అహా! గదలు

చున్నది. నాయదృష్టరేఖ బయిలుబడినది. ఇంక నేను కృతార్థుండనైతి.

(ఇందిర లేచి సిగ్గు, భయము, ఆశ్చర్యము నభినయించి)

దూరమున నిలుచుండును.)

ఇందిర—(తనలో) ఏమిది! ఇంత గాఢపరవశనై నిద్రించితి చోరులచే జిక్కియుంటినే నాచోరులేమయిరి. ఈసుందర పురుషుడెట్లు నిక్కడికొచ్చెను. ఈతని యంకతలముననే బడియుండుటకు కారణ మేమయియుండునో! ఎంత సిగ్గుమాలినపని పరపురుషుడు పరపురుషుడని సంబోధింపుచున్నానే. నాకు వివాహమైనా గాలేదు. నాకు పరపురుషులనగ నెవ్వరు ఈతడు పరపుషుడా కాడు. త్రుటికాలములో దొంగలను జంపిన మహావీరపురుషుడై యుండవచ్చును. అహా! ఏమి నీతనియందము యంగసౌష్టవము.

ఉ. ఈతని జవ్వనంబు జల ♦ మీతనియందము వీని సత్కళల్
ఈతనిమోము సద్రుచులు ♦ నీ కనుదమ్ములు బెళ్కు దిన్ననల్
వ్వాతెరబింబ సదృశము ♦ వాంఛిత మొప్పగ వీని జూడగా
నీతడు మారుడో మరి యనంతుడో నీరజనాభుడో యిలన్.

అహా! ఈమనోహరమూర్తిని జూచినగోలది దనివితీరకున్నదే. ఇట్టి వగకాని వరించి మన్మథసంగరంబున గలయ గలకంటిదేగదా మహాభాగ్యము!

ఆ. బంగళాకాశ్రిపు ♦ బాదములందు బూటు
కళ్ళకద్దాలు ♦ కడచేతి రిష్టువాచి
విటులయందున నీతడు ♦ వన్నెమేను
నితని పొందని అతివయు ♦ వేష్టుగాదె.

ఈసుందరపురుషుడు నాడెంద మపహరించినను నే బల్కరించుట
మంచిది గాదు. ఈతని జూచిన భయంబును, సిగ్గును గల్గు
చున్నది. నేను మాటలాడక యూరకొనియెద. ఈతడే మన్ననో
జూచెద.

బలే—(తనలో) ఈమె యుదంతమరయక యూరకొనుట మంచిది
గాదు. మెల్లగా గథలోకి దింపి యీరంగుకత్తె రంగేమిటో
గనుగొనియెద. (దగ్గరకు సమీపించి)

ఉ. ఎవ్వరిదాన వే కులము ♦ దెయ్యది నీ తలిదండ్రు లెవ్వరే
జవ్వని నీదుయునికి యెట ♦ జాయగ నిన్ను బరిగ్రహించినా
జవ్వను డెవ్వడే మిగుల ♦ జోదులకున్ నెటు జిక్కినావు నా
కవ్వలి సంగతిన్ వినుట ♦ కాతురతన్ దగజెందె డెందమున్.

అతివా! నాయందు ననాదరంబు జూపక నీ యుదంతమంతయు సవిన
యంబుగ దెల్పగోరుచున్నాను. నీ నుడులకు నావీనులు వేడుక
పడుచున్నవి.

ఇంది—(పూరుకొనును.)

బలే—చెలీ! నాతో మాట్లాడుటకు నీమనస్సొప్పలేదా! నీవు మాట్లా
డుటకు దొందరింపకున్నను—

గీ. నీదు జాకట్టులో నుంచి ♦ నిక్కుచనులు
పిక్కటిలి పైకి నెగదన్ని ♦ ప్రియుని జూడ
త్వరించుచు నున్నవి ♦ తోయజాక్షి
యింక సాగదు నవిధమైన ♦ నుడుగు నాతో.

ఇంది—(తనలో) ఈతడు వీరపురుషుడే గాక శృంగారపురుషుడు గూ
డనై యున్నాడు. ఇంకను నీతడేమి యొనర్చునో జూచెద.

బలే—సుందరాంగీ! నన్నెందుకు జిక్కులు బెట్టెదవు. నాతో నొక్క
మాటాడిన నీనోరు నొచ్చునా! లేక.

గీ. పల్కినంతనే నీనోట ♦ చిల్కునటవె
బూలు రత్నంబు లన్నియు ♦ బుడమినందు
యింతి నోకమాట నాగుట ♦ వింతయటవె
జిల్క పలుకులు నాజెలి ♦ నోల్క నీవె.

ఇంది.—(తనలో) యీమోహనాంగుడు నన్నింతబ్రేమించి నడుగు చున్నప్పుడు నే నెంతసేపు నాహృదయము జిక్కబట్టుదును. నే నింక నాహృదయము నాపజాలకున్నాను గదా. (ప్రకాశముగా) ఆర్యా! నేనొక అనాథను, అభాగ్యను. నాయుదంత మంతయు తమలాటివారు విని హర్షించదగినది గాదు.

బలే.—ఏమేమీ! నీవు అనాథవా! అభాగ్యవా! అట్లయిన వినుము.

ఆ. భర్త లేనట్టి ♦ బాజారు గంపవీవా
భార్య విడచిన ♦ బరమ కిల్లాడి నేనా
యిద్దరిగూర్చె యీమొద్దు ♦ బ్రహ్మదేవు
నహాహా యీడును జోడును ♦ నెంచినాడు.

యింతీ! నీవు అభాగ్యవనుటకు వింతగొల్పుచున్నది. ఏమనియెదవా.

సీ. కడవన్నె బంగారు ♦ కటిం జెక్కిన గొలుసు
మెడ నందువైచి ♦ మోపించినావు
డై జెక్కు గజలొ♦డ్డాణంబు నడుముకు
బిగియించి గజబిజ ♦ బొందినావు
యస్ కళావరు గాజు ♦ ఎంతో ముద్దులగుల్కు
జేతులం దాల్చి ♦ జెలరేగినావు
సీమ రవ్వలజత ♦ జెవులకు గీలించి
తళ్కు తళు క్కంచును♦ తారినావు

గీ. నింక నెనెన్నొ నగలు ♦ నీ వంటినంట
శిల్కుజాకెట్టు జీరయు ♦ జెలువు జూవ

నీవు నాభాగ్య వనట ♦ నీ ట వెంట
జెప్పుటయు న్యాయమౌనె యో ♦ చిన్నదాన.

సుందరాంగీ! నీసుందర ముఖారవిందము జూచిన గోలది నాడెందము
తొందరించుచున్నది ఏమనియెదవా?

గీ. వెన్నగుట కనుబోలు ♦ వన్ ముద్దునొకటి
గొట్టి తమిదీర నిను ♦ గౌగలించగోరి
తొందరించుచు నున్న నా ♦ డెంద మిదిగో
దట్టిజూచుము దడ దడ ♦ గొట్టికొనియె.

బలే—ఇదిగో! నాగుండెలమీద చెయివేసి జూచుము. (అని సమీపించును.)

ఇంద—మోహానాంగా! మీరింత దొందరించుట భావ్యమా! నే నహితను గదా! అదిన్ని గాక శూరకులంబున బుట్టినదానను నన్ను మీరు గవయుట. మీకును నాకును శ్రేయస్కరము గాదు. గాన నాదారిని నేబోయెద. మీదారిని మీరు బొండు. ఇతరులు జూచిన నపవాదంబు సంభవించు.

బలే—ఓసీ! అపవాదంబుకు జంకి నపరమితానందంబు నొసగు మన్మధసంగరంబు మానికొనియెదవా?

చం అపవాదంబని ఎంచి హాల్య సుర♦నాధున్ మానెనేబొంద
గపిరాజుం డగువాలి జావగనె ♦ గన్యాతారయున్ బొందె
తపసూన్ గురుభార్య చంద్రునితో ♦ నెంతో మోహ మల్లాడదే
నపవాదంబని నెంచి మానుకొని ♦ రె నుంతైన కాంతామణుల్.

అట్టి దేవకాంతలు నహితము మోహాపరవశులై విటుల మనఃకమలములు వికసింప రతిసుఖానంద పరవశులై నిరంతరము రతి రాజుకు వశులై మెలగినారు కాంతా! ఇక కాలయాపన మొనరింపక నామందిరమునకు విచ్చేసి నన్ను ఆనందింపజేయుటకు రమ్ము.

ఇందిర — సుందరుఁడా ! వారు త్రివదంబునుండు దేవతలు వారు నెట్టి
జను లాచరించిన నెగ్గులేదు. మనము నరులము గదా ! వారి
కిని మనకును చాలా తారతమ్యమున్నది. గాన నన్ను మన్నించి
మన్మందిరమునకు నన్నంపి పుణ్యమును గట్టుకొనుడు.

బలే — అహా ! ఎంతసేపు నిన్ను బ్రార్థించినను నీ మనము చలింప
కున్నదే. నీహృదయము కఠినపాషాణము గాదుగదా ?

ఉ. చక్కని దానవంచు మది ♦ సంతస మొందుచు నింతసేపు
మక్కువచేత నన్ను బ్రతి♦మాలిన గాని యనుగ్రహంబురా
దెక్కడ రాతిగుండె దరు♦ణీమణికో నను దుఃఖపెట్టనే
చక్కదనంబు యవ్వనము ♦ శాశ్వతమంచు దలంచుకొంటివో

ఇందిర — (తనలో) అహా ! ఈతడు నన్నెంత ప్రేమించెను. ఇంక నే
నితనివశమై నామనోభీష్టమును దీర్చుకొని సుఖించెద. (ప్రకా
శముగా) సుందరుఁడా ! మీరు నన్నింత ప్రేమించిన నే నేమను
దానను.

బలే — నీ వేమనుకొన్నను నిప్పట్లను నిన్ను విడచువాడను గాను.
ఏమంటివా ?

గీ. భుజబలంబును జూపి ♦ భూజాతగొంచు
నేగు రావణు భంగి నిను ♦ గొనుచు నేను
నేగువాడను గాని నిను ♦ విడచువాడ
గాను గాంతరో వేగ లెమ్మ ♦ గొడవలేలా.

ఇందిర — నే నంగీకరించనప్పుడు గదా. నన్ను మీరు బలిమినిగొనుట.

బలే — అవును. నీవు నన్ను బరిగ్రహించుటకు నొప్పుకొంటివా ! అట్ల
యిన నాలశ్య మెందులకు రమ్మా నావెనువెంటను.

(అని నిష్క్రమింతురు.)

## మూడవరంగము.

### ప్రవేశం:—రామనాథం, హరివర్మ.

హరి—మిత్రమా! ఈమధ్య సంగీతమందిరమునకు రా మానితివి కారణ మేమైయుండునో?

రామ—కొన్ని కారణములచే సంగీతమందిరమునకు వచ్చుటకు వీలు చిక్కక రా మానితిని.

హరి—ఆకారణము లేమయియుండును. నే వినదగినచో వాక్రువ్వ గోరెద.

రామ—సఖుడా! నీవు నా ప్రాణమిత్రుడ వగుటచే నాయాంతర్యము నీతో దెల్పక ఇంక నెవనితో నుడువుదును. ఈమధ్యను మన వీటనున్న నొకకుసుమగాత్రితో నసమానమగు స్నేహాముల వడెను. దానంజేసి నాకు దీరుబడిలేక గానవిద్య వెనుకాడినది.

హరి—(తనలో) అవురా! కాలమహిమ నామిత్రుడు అగు రామనాథము సుగుణోపేతుడని నమ్మితినే. ఈతడు పరసతుల పరిరంభణాదుల నెలగొల్పనెంచి తన పరిశుద్ధమైన మనమును బాడు జేసుకొనుచున్నాడు. ఇంక నే నుపేక్షగొనుట ధర్మముగాదు. ఎట్లయినను నామిత్రునిగుణంబు దిద్దజూచెద. (ప్రకాశముగా) మిత్రమా! నీవు సుగుణరాసివనియు, సూనృతవచస్కుడవనియు నమ్మితినే. ఇట్టి పరనారీహృదయపంకజభృంగ మీవని నెరుగను. నీవు పరనారులగవయుట నెంతగల్మషము, నెంత యేహ్యము, నెంతక్ష్యారము.

ఉ. పరకాంతల్ దగగూడు యే♦పురుషుకున్ మర్యాదయున్ మాయమా
నిరతంబున్ దిగులొంది తా♦దినుగు నిర్భాగ్యుం డటంచు వడిన్
వెరపింతైనను లేక యే♦యెదుట వే జాటించి దూషింతురు నీ
వరపత్నీ మణికింతయున్ ♦ వినిన తా వాంచించు యేనూతకో.

పరకాంతను వాంఛించిన పాకశాసనాదిసురులు నెట్టి యిక్కట్టులకు మూలమైరో నీకు దెలియదా, నీ వెఱుగని ధర్మమున్నదా. అయినను జెప్పెద వినుము.

సీ. పాంచాలి గనగోని ♦ పరమ మోహము నొందు
    కీచకు డంతనే ♦ కీడుమనియె
అల సాధ్వి సతిను ♦ నపహరించిన యట్టి
    కైకేసి సుతుతల్ ♦ ఖారుమనియె
హల్యను మోహించి ♦ అల ఫరుహూతుడు
    గన్నులై మేనెల్ల ♦ గోలుమనియె
తులసి నెనయగ జూచి ♦ జలజాక్షు డంతట
    బండరాతిగనయ్యె ♦ భోరుమనియె

గీ. గాన నిటువంటి స్వాములే ♦ గాంతలందు
మోహమును బొందె బుద్ధి ♦ మూర్ఖతన జెంది
ఘోర కడగండ్ల గుందియు ♦ గోలమనుచు
పుడమి నపకీర్తి బొందరే ♦ పుణ్యసఖుడా

హరి—మిత్రమా! నింక నామాట విని యీగుసుమగాత్రిల మాయలను దగులక మరియానను నాపాపుణాని హరినిగొల్చి నయమార్గవర్తివి గమ్ము.

రామ—సఖుడా! నిజముగా నీవా నీరజనేత్రిని జూచినచో నీవిట్లు వచించియుండవు ఆమెను దరము జూచిన నారదవశిష్టాదులు సహితము మరునకు దాసోహము జేతురు. మన మనగ నెంత వారము.

గీ. ఆమె వదన మ్ము జూచిన ♦ నవ్వుగలిన
శశియు బింబంబు ♦ శ్వేతవెన్నెలయు గాదె
పద్మరాగంబు జక్కని ♦ బగడతీగ
నెలత యధరంబు మేనును ♦ నాశ్రయించె.

గానవాణి మీనసనేత్రియు తిలనాసికయు బింబోష్ఠియునను టకు నెంత
మాత్రమును సందేహము లేదు నిట్టియందముగల మందగమన
మూడులోకములనున్న సుందరులయందు లేదని నాయభి
ప్రాయము.

మ॥ భూమిని గాంతలు వేనవేలుగద యీ। భామామణిన్ బోలు।
కామినులెందుఁగన్ గజగామినులవా రలము। కాంతిన్ ప్రకాశంబున్।
సీమంబున్ జనసూటపాంపులన్ గోటున్। సీటునోయ్యారమున్।
గావున్ బంగారు యొగాడ యింటిగుమనునన్ నా। గాంత జింతింపమే॥

హరి-- మిత్రమా నీంకనీ వాక్యసుధారసంబులకు సంతసించితిని నీవు
యూకాంత చెట్టబట్టి నామెశృంగారమంతయు శ్రవణానందము
జేసితివి చాలుచాలు నిదియా నీ తెలివి చేటలు

సీ॥ వలపులుగట్టిమూకళ్లు ♦ బేడిసలంచు
దానురరేకలంచును ♦ దలచుగాదె
ఏమిడిగారెడు నా ♦ శకంబునుగాంచి
చెలునైనకోటేరు బోల్చుగాదె
నలిమిచేసండిన ♦ గుండ్రిజెవ్వులను
శ్రీకారములబోల్చి ♦ జెప్పుగాదె
మాత్రప్రాకీమమూలు ♦ మురికి దుర్గంధంబు
దేహంబు నొలకరి దీగగాదె

గీ. వనుచు గవులెల్లవర్ణించు ♦ గారణమున
మోహజాలంబునందున ♦ మునిగిరులు
ఆదిగ ధ్యాంతః హితుల ♦ నాత్మనిడక
అంత్యమందున యమునచే ♦ నాత్రిబడరే.

నిట్టి హేయమ్యమగు దనువును శాశ్వతమనినమ్మి తుచ్ఛవ్యసనములకు గడంగి
యుశమును నసింపజేసిన గాలుడు గనికరించునా మిత్రమా

ఇంక నిట్టి చెడు నడవడికలకు నిష్టపడక నా పరంధాముండగు రాము
ని భజించి నిహసుఖములను బొందుము.

రామ—నీవెంత వేదాంతముపన్యసించినను నీవెంత దైవభక్తిగ్రహిస్మ
రించినను నాయిందు వదనయదు నాడెందముడగు కోపపీడ
కున్నది నింక నీ విషయమై ముచ్చటింపవలదు ఏమంటివా?

ఉ. ఇంతినిగాంచగా మనము ♦ నొందునొ జెంచెలవారి బారికిన్
వంతలనొంది నోర్చుటకు ♦ నెట్టివ ధన్యులకైన జెల్లునే
వంతము గట్టిగామమము ♦ బాల్పడకుందుమె పద్మలోచనున్
జింతనుచేయగానశమె ♦ జయ్యనమోహముచేత మిత్రమా
నదినిన్నిగాక మానకు

తే. బాల్యమరిగెనుమనకు ♦ బ్రిహ్మాండమైన
యవ్వనంబేర్చె వేషక ♦ మాయునయ్యె
సతులజూచియు సరసంబు ♦ జరపవలయు
గాని వేదాంతభక్తియు ♦ గోరనేలా.

మిత్రమా? నింక వృద్ధాప్యమువజల్పు దైవభక్తి నిప్పాను దంకొక్కించు
కొనిన నరులు మనలను పిచ్చవారమని నగుబాట్లు వేసినవ్వరా
ఏయే కాలముల ఏయే బనులు నాచరింపవలయునో యట్లు ఆచ
రింపని పక్షమున నపనిందకు బాల్పడుదుము గాన నికముందు
వేదాంతమును దైవభక్తియు నెంకొల్పవచ్చును. మనము నిందు
జవ్వసమున నుండుటచే కామము నెంకొల్పవలయును. అందుచే
నీవు కొకదక్క చక్కని బొమ్మ చెట్టబట్టి చెక్కిటొక్కుచు
చెరుకువిలుకాని చైవులు జలుపుటయే మంచిది.

హరివర్మ—సఖుడా? చక్కనియుపన్యాసమిచ్చితివి గాని, సీతావు
శాశ్వతమనియు, ధనయౌవనంబు జిరకాలముండుననియు,
భార్యాపుత్రామలు, బంధువులు బగివేష్టింప గర్వము
గొట్టి గామక్రోధములచే మిట్టిపడి తుదకు మట్టిపాలుజెందుట

ననేగాని నీనివల్ల నినుమంతయు లాభకరంబులేదే? వృద్ధాప్య మున దైవభక్తిని నెలకొల్పుదమన్న నంతవరకు మృత్యువ నువలను బద్దిడక మానునా ఏమినీకీసెట్టి.

సీ. పంచభూతములచే ♦ బరగిన దేహంబు
పరమాత్మనున్నట్టి ♦ పంజరంబు
పాపపుణ్యంబులు ♦ పరికించు నింద్రియ
స్ఫురణగల్గినయట్టి ♦ పీచుకాయ
కష్ట సుఖములకెల్ల ♦ కారణమైనట్టి
కడువిహ్యమైన యీ ♦ ఖర్మఘటము
జననమరణములచే ♦ జరియించు తనువిది
జావును యాత్మను ♦ జావులేదు

గీ. తెరియుగా నుండి ♦ ఎప్పుడో దొలగిపోవు
నీటిపైనున్న బుద్బుద ♦ సూటిగాదె
గడవినుండిన భూమిని ♦ నణగియున్న
మూలనున్నమృత్యువు ♦ మ్రింగకున్నె

రా!— సఖుడా! నీవెంతచెడివినను కంతశోషయేగాని దైవభక్తియన్న నాకు దలకెక్కలేదు సరిగదా, ననునీవట్లువిడిచిన నపరిమిత సంతసంబున దిరిగిచూడకుండ నరుగువాడ

హరి— ఏమి? నామాటలు నంతకర్ణకఠోరములుగానున్నవి. యా? నీయందు నిరత్రివాత్సల్యముచే నింతసేపు వాగ్బంధనాదులు నుడివితిని గాని నీయభీష్టమెట్లుండునో యనుసంచరింపను. నేనిచ్చట నిలచుట కజ్జంబుగాదు నేనిదే వెడలుచున్నాను (అని నిష్క్రమించును).

రా— ఇప్పటికి నాపీడవదలినది నింక నేజాగుచేసినచో నాప్రియురాలు నారాకను నిరీక్షించుచు నెంతపనుగుచుండునో గాన నేనోయె దనని (నిష్క్రమించును).

ప్రాణపతికిని వెగ్గలైతి ♦ ప్రియుని బాసి
బ్రతుకుమని నుదుటవ్రాసె ♦ బరమేష్టి నాకు.

నావిధి యిట్లుండ నింకమీరేమి జేతురు నెప్పటికైన నానాధునకు నామీఁద ననుగ్రహము గల్గునా ?

అత్త:— కమలా మొదటినుంచి నీశాంతమే యింతముప్పుతెచ్చినది మావాఁడు బలేరావు బండ బండకు దగ్గ ఆట ఆడవు.

కమ:— అత్తా నేనేమి బడాటాడనమ్మా నాదైవము, నాప్రాణపతి, నాజీవనాధారము, నానాధుని నాహృత్కమలమందు నారాధించడమునకు మారుగా నొవ్వనాడిన నెట్టిరౌరవాది నరకముల పాలగుదునో గదా ?

అత్త:— (తనలో) ఆహా నాకోడలు ఎంతసుగుణరాశి ఎంతపతిభక్తి గలది సావిత్రీ, సుమతీ దేవులమించుచున్నదే ఏమినాభాగ్యము యిట్టి సకోడలోపేరను, యిట్టి యిల్లాలును నాసుతుఁడు నిర్భాగ్యుడై యంటరానివానిఁ గూడి కంటికెదుటనైనా జూడకున్నాడే ఏమి జేయుదును గట్టిగా మందలింతమన్న వాడిజాడయే గనబడకున్నది (ప్రకాశముగా)

సీ. గంటి వేగాని గనుపార ♦ గన్నసుతుని
బెంచితినిగాని ప్రియమున ♦ బ్రీతిగాను
నిట్టి దురాగ్రహుఁడౌనంచు ♦ నెఱుగనైతి
నేమి జేయుదు నీగతి ♦ నిట్టులయ్యె

కమ:— అత్తా మనము కంగారుపడి కార్యములు సాధించగలమా మనపాలిటనున్న యాపరమపావని భవానియే మనపరితాపము దీర్చ; నానాథుని నాకొసఁగల్గును నాత్రిలోకజనని త్రిపురాంతక సతి, నాప్రమాదేవి నన్ను గరుణించి నామనోభీష్టము నెఱవేర్చదా తల్లీ

అత్త:—అమ్మా! కమలా నేఁడేమో ఇట్లాచున్నది ఆవచ్చేవారెవ్వరో జూడుము

కమ:—(చూచి చిరునవ్వు మొగమున) అత్తా మీకుమారరత్నమే వచ్చుచున్నారు

అత్త:—(ఆశ్చర్యముతో) ఏమీ మా వాఁడే ఏడీ! ఏడీ! (చూచి) నాయనా ఎక్కడికెళ్లేవోయి

ప్రవేశము:—బలేరావు

బలే:—నేనెక్కడికెళ్లితే మీకేంములే నాయిష్టమొచ్చిన చోటికెళ్లితిని నన్నటకాయుచు నాపకు

అత్త:—అయ్యో నాయనా అడిగితే తప్పటోయి

బలే:—ఛీ ఛీ అడుగుటకు నీవెవ్వరవు

అత్త:—నాయనా! కన్నకడుపుగాదా నీవేమయిపోతివో నెచ్చటికెళ్లితివోయని యడిగితిని

బలే:—నింతటనుంచి నాప్రమేయము నీకద్దు నాయిష్టమొచ్చిన చోట్ల తిరుగువాడ నిఁక నన్నడిగిన సహించను

అత్త:—యింతపిచ్చి తామసమేమిరా నాయనా యీయిల్లాలు నీభార్యామొగమైన జూడక కుచ్ఛితుల కుటిలలో బడి కూలిపోతావట్రా అమ్మా? కమలా స్నానమునకు నీళ్లుబట్టె అబ్బాయి స్నానము చేస్తాడు తెగనాయనా నెప్పుడుతింటివో కాస్త అన్నముతినుము (కమల బిందితో నీళ్లుదెచ్చి అచ్చటదించును)

బలే:—(కోపముతో) ఓసి మూఢురాలా నాస్నానమునకు నీపానీయంబుదెమ్మన్నవారెవరు నిచ్చట నీజలఘటముండరాదు (అని కాలితో నీళ్లబిందెనుదన్ని కమలను గొట్టి)

ఉ. స్నానంబెందుకు నాకు జూడ ♦ నిక సన్యాసంబు శ్రేష్ఠంబుగా
మనమందున్ నెలగొల్పినాను ♦ నిక వైరాగ్యంబునన్ జెందగా

నేన నిష్టన్ గవమెుంచి ♦ నేర్చేదను నాజోక్యంబు వలెనన్న
యి సిల్కున్ గిల్కు దెచ్చిపెట్టి ♦ నిటునాట్యంబున్ దగన్ జేతువే
[అని కమలను గొట్టును]

అత్త:— (అడ్డము జొచ్చి) ఓరీ దురాత్ముడా? యీయిల్లాలను యింత యేకుపిస్తూయున్నావేమిరా శుంఠ? పాపముండలు బోధించిన పాపమటారి వరమపతివ్రతను, బలుకాదని బరమసాధ్విని బడమోదుతున్నావేమిరా నీవు సన్యాసివవుతావో, బైరాగి వౌతావో అవరా? నాయింటికొచ్చేవంటే గెంటిస్తాను

బలే:— ఏమిటీ! నీయింటికివస్తే నన్ను గెంటిస్తావా! ముసలిముండవు గదాయని నూరకొనినగొలది మాటలు హెచ్చుపెరుగుచుం టివి నీకు పాదప్రహారములు దగిలించి నిన్ను యీసౌధము నుంచి నా గనంపినగాని నీవదరుటమానవు.

అత్త:— ఓరి! యీగాల్పురికర! నన్నుగాళ్లతోదన్ని నింటనుంచి నీడ్చి వేస్తావటారి నిన్ను గని బెంచినందుకిది ఫలమటారి నింత బండ మొండివైతివేమిరా!

బలే—వగడా! నీవదరుట నింక వదలవుగాజోలు నింకనిచ్చట నుండ నగవు పొమ్ము (అని దల్లినిగెంటును.)

అత్త—ఓరి నాయనా మనుష్యులను ఎందుకు సంపేస్తావురా నీవు జెడి పోతావని నీకోనమే జెప్పితిని యీయిల్లునీది యీయిల్లాలు నీవు ఏమిచేసుకుంటావో జేసుకో యీ సేళకుండి రేపుజచ్చేముం డని నాకెందుకు నీయిష్టమొచ్చినచోప్పున జేసుకో చేవెడలు చున్నాను. (అని పోవును)

బలే—(తల్లికి యడ్డముదూరి) నీవెడలుటకు సనోప్పుకోను నాగర్భునకు కొంత ద్రవ్యము గావలసియున్నది. గాన నీదగ్గరయున్నదోడ వులుగాని. నీగోడలుమేనియాభరణంబులుగాని యిచ్చిమరిగదు లుము (అని బడిలిచేతిలో బట్టుకొని నిలబడును.)

అత్త—ఓరి నాయనా నాదగ్గిరేముంది ? యిదివరకే వున్నదంతా వూడ్చేసేవుగదా ఏదో పచ్చపచ్చగా (కోడలవైపుజూపి) దాని మెళ్లో పదికాసుల బంగారముంటే నీకళ్లు పచ్చబడ్డా యటా? యీపదికాసుల బంగారమైన యుంచక బావుజేసుకొని పకీరువాడవై పరాయివాళ్ళ పంచలట్టుకొని పాణాలు విడుస్తావటా? ఓరి నీకెటువంటి పాపబుద్ధి పుడుతూయుందిరా నాయనా ?

బలే—అమ్మా! నాకీమాటలతో బ్రయోజనము లేదు ఏమంటివా ? జెప్పెద వినుము.

గీ. నేను నడిగిన తొడవులు ♦ నాకు నిచ్చి
బంపు బంపకయున్న యీ ♦ పిల్లవల్ల
నీదుశిరము బగుల గ ♦ నొట్టి జేసి
తొడవులును గొంచునే గెడ ♦ దడవు లేదు.

అని చేతిబడితె జడా యించును.

కమ—అత్తా! మీకుమారుని సహాయము గుహ్యదయము చేత వికలత్వము బొందుచున్నది. నిక జారుడేసిన ప్రమాదము సంభవించునేమో నాకంఠాభరణమునొసగి కడకాళ్ళు బట్టుమందువా తల్లీ!

అత్త—ఛీ! ఛీ! నిర్భాగ్యురాలా! నీభర్త బండతనంబునకును నీయొక్క బేలతనంబునకును సరిపోయునని సంసారము తయారు బాదు జేసుకొని సన్యాసంబుచ్చుకొందా వేమిటే!

కమ—తనలో

గీ. అత్తయాజ్ఞకు నేమియు ♦ నాకు లేను
భర్తనాతుడ్గుడైయుండె ♦ బరగనము
దెమ్మటంచును నామీద ♦ దెబ్బలుజూవ
నేమిదోచదు దైవమా ♦ నెట్టిరవ్వా!

నెంతకృతజ్ఞతా ♦ నెలమిఁజూపిన గాని
గానియిమ్మన్నను ♦ గానిలేదు
తనప్రాణమునకు ♦ దా ప్రాణమిచ్చినగాని
గానియిమ్మన్నను ♦ గానిలేదు
గీ. భార్యయేగాదు బరము ♦ బంధువులెగాదు
పూరుబెద్దలెగాదు ♦ వుద్యోగులైన
దెబ్బనకు దెయ్యమైనను ♦ దెవుబట్టి
కాళ్లబడి కాసిగాదు ♦ గానులకొ నొసగు॥

(బడితె జడాయించి) యింకనేనిచ్చుట నిలువరాదు నీతాకోహారంబు నెవరివద్దనైనను దాకట్టుబెట్టి ధనమును స్వీకరించి నాప్రియురాలు యిందిరి మందిరమునకు నరిగెదను. (నిష్క్రమించును.)

అత్త— కమలా! అయ్యిందే ఆకాస్తాను బండమొండెవాడని నాకు భయమేస్తూనేయుండేదే అయ్యయ్యో ఏనాటిహారము ఎప్పుడుసంపాదించినది మీమామ మామగారు తండ్రి తండ్రి తాతతాతనాటి దివాణాండ్రభైరేంమూభ్య సర్వముస్వాహాకేజేసి రైతుల నేడిపించి వాళ్లవల్ల లంచములు బుచ్చుకొని సంపాదించిన ముత్యాలహారమని మాఅత్త అత్తగారు నాతోజెప్పేది యింతవరకల్లా మూలనేయుండేదే పాపిష్టిదాన్ని నందుకుదీసి నీమెళ్లోవేసే పాపిష్టిగాడ్డి కళ్లతోజూచేను చూచినప్పటినుంచి నిప్పులుద్రొక్కినట్లె చందంబున జగిరి గెంతులేసి నీమెడలోది దెంపుకుపోయిందాకా నిద్రకేబోవకుగాదు అయ్యయ్యో నెంతచక్కనిహారము, నెంతవిలువగలహారము ఆరువేలరూపాయాల హారమే అగ్గిడిపోయిందే అనియేడ్చును.

కమ— అత్తా! మనమెంతవిచారించినను గార్యంబులేదు మీకుమారునిదే ఆసామ్మాటచేత ఆయనదగ్గరకే నాముత్యాలహారము

జరిగినది దీనినిగురించి మీరింత వలవంతనొంది గుందుట సహజమా ?

అత్త.— కమలా! నీవన్నట్లు నింకగార్యములేదు యీసంసారమునిల బడేమొత్తులేదు పుట్టిగా మండలింతుమన్న వాడిచే పాద పరిహారములు దగులునని భయమాగుచున్నది. నింతకాలము బ్రతికి నింటివెనుక వచ్చినన్నట్లు నాకురాపీడగచే దెబ్బలు దిని బ్రదుకవలయునా నేనిచ్చటనుండజాలను నేనేకాశీయాత్ర కోబోయెద (నిష్క్రమించును.)

కమ.— అత్తా! నీవరిగినవెనుక నన్ను ఆదరించువారెవరు నేనెట్లు జీవింతును.

గీ. అత్త కాశికిపైనమై • యరుగుచుండె
భర్త పరభామలనుగూడి • పాపులాడు
నింటనిలుచుట కష్టంబు • వంటిగాను
ఏమిజేయుదు నాప్రాణ • మెట్లునిలచు॥

హా! భవానీ నన్నురక్షించుట నీకుభారమయ్యెనే తల్లీ నేనింక నిలువజాలను నీలోగల్పుకొని నాకు పరసుఖంబులు నొసంగుము. (అని నిష్క్రమించును.)






# గుండెగుభేల్.

## తృతీయాంకము



### ఒకటవ రంగము

ప్రవేశము:— రామనాధం, నాయుడు, లడ్డూఖాన్, రామిశెట్టి కోర్టు

రామ:— ఎంతమిత్రద్రోహి ఎంతకుచ్ఛితుడు ఎంతదారుణమైన యుద్యమము తలపెట్టెను నాపరమమిత్రుండని దలపోసితినిగాని, యిట్టినమ్మకస్వామిద్రోహియగువాని నెరుగను బలేరావన్న నెంత భక్తిశ్రద్ధలుగా జూచితిని నిట్టి చెండాలుడనిన అనాడే మిత్రకోటినుంచి దొలగించకపోతినా!

నాయుడు:— బలేరావేమొనర్చెను నాకును యీమధ్యమున గాన మందిరమునకు వచ్చినజాడైనా గనపడదే అతడేమయినాడు!

రామ:— అతనుజేసిన యుద్యమము మీరెరుగరా?

తే. నన్ను మరగిన కాంత • సమాంతముగను
నెత్తుకొనిపోయి • నెవ్వరుజూడకుండ
నూరువెలుపల నున్న • నుద్యానమందు
నుంచి దమిదీర దానితో • నెవయుచుండె.

అని నాసహాకారుండొకడు నాతోఁ జెప్పె నిది యథార్థముగాని యసత్యముండదు వీఁడు నెవ్వాఁడును కుచ్చిత నాలోచనపరుఁడే నాముద్దుల గుమ్మను నావలపుల బరణిని నాధనపేటికను నేమందుఁ డెవాఁ డెవ్వఁ డమ్మి తన వశముఁ జేసుకొని మాఱుచున్నాఁడట అహా! యింతలో నాయవస్థ దారుణమాయెఁ గదే.

సీ. ముద్దు నిమ్మను ♦ మోము దగ్గిరఁ జేర్చి
బుగ్గఁ జూపించెడు ♦ ముద్దరాలు
దోమలపాకల దెచ్చి ♦ తోడిమలు జుట్టియు
నోటి కందించెడు ♦ నీటుఁగత్తె
ధనము లేదనుకొన్న ♦ ధైర్యంబు దగఁ జెప్పి
వేలకు రూప్యముల్ ♦ నిచ్చునింతి
నేవేళ కావేళ ♦ వేఁడి ఫలహారంబు
వకొడి గారవూప ♦ బంపు తరుణి

గీ. నాదుమాటకు జవదాట ♦ నెఱుఁగనట్టి
గులుకు గుబ్బలు నాయెద ♦ గూర్చునట్టి
సుందరంబైన యిందిర ♦ జూడఁగలనె
కోటి జన్మంబులెత్తి నా ♦ కంటఁబడునె.

నాయ:—రామనాథం మిగుల ధైర్యశాలివగు నీవు వెకవిటకులాడి కై యిట్లు విలపించుట తగునా యిదియంతయు దైవకృతమున దీసగాడు నుండును గాన నెప్పటి కేమి మువ్వావాటిల్లునో యట్టి వారికిని దెలియుట దుర్లభము నేమంటివా ?

గీ. జటికిలోవల ధనవంతు ♦ జటిలపరచి
బీదవానిగఁ జేసి బలు ♦ బాధలెట్టి
బీదవానిని ఋణము ♦ గుభేరుఁ జేసి
సౌఖ్యములనిచ్చు దైవంబు ♦ సంతసమునా.

నట్టి దైవయత్నము నట్టి బలవంతులనైనను దుర్బలులగను దుర్బలులను బలులగను మార్చుచుండునుగదా

రాను:—నాయకుగారు మీరు నుడివిన దైవయంత్రము అతిజిత్రమైనను నామదగజయానయగు యిందిరను మరతుమన్నను మరువురాకున్నదిగదా

ఉ. చక్కని సుందరాంగి యది ♦ చెక్కిన చక్కెరబొమ్మ దీనితో
మక్కువదీర నే రతుల ♦ మెచ్చగ మాన్పడిజేయుచుండగా
వెక్కసమయ్యె దైవమును ♦ వన్నిటు వంచనజేయనెంచి యీ
టక్కరి దారితోబోతు బలె నా ♦ వృథ అలిఁగిజేసె నింతలోన్.

నట్టి మహామునులైనా నట్టి రాజాధిరాజులైనా స్త్రీల మాయామోహమున దగులుకొని గష్టసుఖము కాకరమౌరి అహా! పిపీలకాది బ్రహ్మపర్యంతము నిండిన నానస్త్వేశ్వరుని లీలలు గడువిచిత్రములని తోచెడిని

గీ. నొకని యాలిని నొకనికి ♦ నొసగుచుండు
నొకని యర్థంబు నొకనికి ♦ సంటబడును
నొకని జోగిగజేయును ♦ నొకని భోగి
జేయుచుండును దైవంబు ♦ జిత్రగతుల.

(బలేరావును దేఖించి) అవురా! పరమమిత్రుండవని సంతసించితిని గాని, నాకట్టి దారుణశత్రువౌదువని స్వప్నావస్థయందు గూడ దలంపనే వీనిఖండకావరము నెంతగా హెచ్చినది వీనిని మట్టిబెట్టుకున్న నామనంబు శాంతించదు (కోపముతో)

శా. ఓరీ దుష్టుడ దుర్మదాంధుడ అతి ♦ క్రూరాత్మ చండాల దు
ర్వార్తాగ్రా కంటకహీనకృత్యజరితా ♦ రోషాత్మసంసేవ్యకా
ఘోరాకారము దాల్చి నాయిడిచినీ ♦ గంటంబు గాలి జేతులన్
శిరమున్ వ్రక్కలుజేసి వాయమునీ ♦ సంస్థానంబు జూపింతురా.

లడ్డూ:—హారే రామనాథం వాడుయిక్కడలేని సందూషూషి వాడ్కిమీద కోపంజేస్తే వాడ్కిఏమీ చెయ్యవలె దాన్కి నియ్యామీద నరిపోయి పట్కునదాటింది దాన్కికోపం విషారంగ డావద్దు ఇద్దరకీ మరగయా జెయ్యాల

రామ:—లడ్డూ మన కేయుష్టనులేక యీ బలేరావు యిందిరలను బగి మార్చే యుపాయంబున్న నాలోచింపుము

లడ్డు:—మహారాజ్ హద్దూలేని యూహా చెపుతాన్ జత్తుల్ గిత్తుల్ బెట్టి మంచి మాటల్ గీటల్ జెప్పీ మచ్చికాచేసి మందూ బెట్టీ మాంపట్కి మరగాయా జెయ్యాల

రామ:—లడ్డూ ఎంత తేలికగా వచింపుచుంటివి నతడుసామాన్యుడను కొంటివా మాటలచే మనకు లొంగునా!

ఉ. కుత్సితబుద్ధుడై యతడు • కూరిమిమీరగ కోమలాంగితో
మచ్చటలాడుచున్ దినుగు • మూర్ఖతచూపుచునున్నయట్టి యా
దుశ్చరితుని బధించుటకు • దోర్బలమున్ దగజేవ జూపితే
జచ్చునుగాని మంచిగను • జెప్పిన మాటకు వాడు లొంగునే.

లడ్డూ: సామంబున జిక్కుటకు సాధ్యముగానివాడు నింక దండోపాయం బుననే వానిని దునుముట్టించవలయును (నాయుడువైపు దిరిగి) యిందుకు మననాయుడుగారు ఏమనిఎదరో వినిఎద? నాయుడు గారు బలేరావు యిందిరల బంధించవలయును యిందుకు బంధ నోపాయమున్న వచింపవేడెద.

నాయుడు:—(తనలో) నీతడు నీకార్యమునకు నన్ను సలహానడుగు చున్నాడు నేవిధము చేతనైనను నాచేకచక్యమంతయు జూపి నాడంబవాక్యములచే ఆడంబరము గలగజేసి నీతనికడులు బుట్టించి గొంత ద్రవ్యము లాగవలయును (ప్రకాశముగా) అయ్యా రామనాథం బలేరావన్న బహువికుడు విటకత్తెలను గనిన విసుగు విరామములేక దిరుగు విటశిఖామణి మాయ

లకు శక్తిజిత్తే, బలిమికి బరశురాముని మించునట్టి మహా శూరుని బట్టి బంధించుటకు నెట్టివారికిని మేన బ్రాణంబులు నిలుచునా ? అతడసాధ్యుఁడుగదా !

రామ — నాయుఁడుగారూ బలేరావుని బట్టి మనము బంధించలేమా?

నాయు — ఏమో ? సందేహాస్పదముగానున్నది. ఆలోచించి వెనుక అభిమన్యుకుమారునకు ద్రోణుఁడూహించి బన్నిన పద్మవ్యూహ్యమునకోలు పన్నుగడ బన్ననగాని, బలేరావు మాకుసామాన్యముగా జిక్కుఁడని తోచదు.

రామ — అట్లైన నేమిబన్నుగడ బన్నుదురోబన్ని నాతని గడతేర్చుట యే నాయభిమతము ఈకార్యమంతయు మీమీద నేనుంచితిని మీరు బాలనుముంచినను, నీళ్లనుముంచినను మీదియేభారము.

నాయు — (తనలో), నీతనికి నేబోసిన సిరికిమందు దలకెక్కినది. మన మెట్లాడించిన నట్లు జెలగాటమాడగలడు. (ప్రకాశముగా) రామనాథం, అట్టి ద్రోణవన్నుగడ పన్నుటకు సిద్ధముగనే నుంటిని నీకింత భయమెందులకు నాసంగతినీవెరుగవా ?

సీ. కోర్టులకెళ్ళి ♦ పార్టీలకు సలహాలు
గొమరొప్పజెప్ప ♦ కోవిదుడనేను
తప్పుసాక్షులనెల్ల ♦ తరిబీజులనుజేయు
తర్కంబు జదివిన ♦ తార్కికుండ
దండ్రి తనయులకును ♦ దంపెలు దగబెట్టి
ధనవంతు గృహములే ♦ దారుజేస్తి
భార్యభర్తలకును ♦ బవరంబుగల్పించి
భారతంబిడకీయు ♦ భవ్యమతిని

గీ. ఇంకనేగార్యమైన నా ♦ వంకబడిన
దాటిపోవునె నెటువంటి ♦ ధీయుడైన
రామనాథమ నీవింక ♦ రాజసమున
నుండు నీపగసాధింతు ♦ నింకుమతిని॥

నాహాగ్జాలమువినిన నెదిరింటిపెంకులు బింకంబులుడిగి జలజలా రాల
వలసిందేగదా నాఅట్టహాసమునకు ఈచుట్టుపట్ల నరువదిరెండు
నూళ్ళు గడగడలాడి, గడుపారగూడు, నీరంబులు గోల్పోలక
నట్టుడికినట్టు నుడకవలసిందేగదా ఇంక బలేరావన్న దృణప్రా
యునిగానెంచుము.

గీ. నాదుశూరత్వమింక ♦ నెరుంగలేవు
వాడిమించినగోళ్లతో ♦ నేడెగోకి
బిలదిగయ్యంబుదగదెచ్చి ♦ బిలుకమార్చి
ఎరుగజెప్పుదు నాశౌర్య ♦ మూర్వినందు॥

యీమధ్య సివిల్ క్రిమినల్ కేసులలో నెంతమంది వీరాదివీరులను శిఖ
పట్లగోత్రములుజేసి మనవీటనుంచి నవశీలకు సాగనంపితిని నీ
వెరుగవా? ఒక్క నరసంచిరూప్యములు నీవిచ్చిన ఒక్క నర
గంటలో బలేరావునిబట్టి శతయోజనంబులు దాటించి లంకా
ద్వీపమందుంచగలను.

రామి — ఓయిదేముడా! యీనాయుడుగాడు ఏవివారంలోకివచ్చి
నాడబ్బు దిగమింగడాని కాలోచనచేస్తాడు.
వీడూహాకాల మొన్ననాయిల్లు నట్టేటిలో గట్టేసేడు. బాకీలు
ఎగదియ్యమని

నాయు — శెట్టిగారేమిటా దీర్ఘాలోచన

రామి — అబ్బే! ఏమియుగాదు తక్కెడ తాళ్ళుతెగి సిబ్బెలు చితుకు
తాయి అని

నాయు — ఓరినీయుక్తిగాల! మావీపులు చితుకుతాయా, మాతాళ్ళు
తెగుతాయి బలేరావంత బలవంతుడా మమునెదురుకొనుటకు.

రామి — బలవంతుడో! గిలవంతుడో! నాకుదెలియదుబాబు వెనక
వెచ్చమట్టికెళ్లీ, అడిగితే ఆరువీశెల లెంపకాయకొట్టె యీడ్చేడు

యిప్పటికీదవడ వాపుదియ్యలేదు యీా సాయబుగారినికూడా వక్క యిసురుయిసిరేదు సాయబుగారూ నిజమేనా అబద్ధమా?

లడ్డూ—అరే! బకాలి పిరికిమాటా, ఝూటామాటా నాద్వవద్దు నాదూ సత్వానీకు తెల్వలేదు నాదుబలం ఏన్గుబలం

రామి—సాయబుగారూ? మీాకు ఏనుగుబలముంటె మొన్న సంతలో చాకలోళ్ల చేత దెబ్బలుదిన్నారేమండీ

లడ్డూ— ఇదీ నీతో ఎవడూచెప్పేడోయి మేముగాదు ఎవడ్నిజూచి నీవ్ గడ్బిడా మాదీహానియుండావు సంతలో గడ్బిడా మాదీ హైతే సాకలీ, గీకలీ సంతా, గింతా మొగిరి ధౌడుదీసి వాబు డాయించడ్

రామ—అయితే, నబాబుగారు మీాతిండి మంచిదా మాతిండి మంచిదాండీ

లడ్డూ—అరే! మాదూతిండి తెల్వాలేదు యేమీాతిండి తిన్వాలంటే పులావ్ తిన్వాలి, ఘోష్ తిన్వాలి, రొట్టితిన్వాలి లేకపోతే యింతా సత్వావస్తాదీ?

రామి—అయితే! యీావేల సచ్చినోడు మాఅయ్యాఅబ్దీకం మాయింటికాడ మాఅత్తప్పవండిన అత్తెసరు తినిచూడండి దానిముజాకా!

లడ్డూ—తూన్, తూన్ దిగదుడుపుగూడూ బెట్టీ, దున్నాపోతూ పెరుగూబోసీ, మాముడ్డకాయ పచ్చడీబెట్టీ తినమంటావు యేమిటితినేది నా ముఖం, నీ ముఖం.

రామ—లడ్డూఖాన్! మాటలకేమిగాని నీవుతురకబిడ్డవు బలవంతుడవు నీవల్లను నాకార్యము సఫలత్వనొందవలయును. దుర్మార్గుండగు బలేరావునిబరిమార్చి, నా మనసంతోషమునుగూర్చుము.

లడ్డూ—ఓ! తప్పాకుండాచేస్తాన్ బల్లేరావు, గిల్లేరావు నాకూ హాద్వా లేదు. మక్కాకే మరగయాచేస్తాన్ మహారాజ్ సందేసం పడావద్దు మాకు పిల్లల్, జల్లల్ నిండావున్నారు. నాకూ

ఝోడా భార్యల్ నిండావున్నార్ మాకూ దిన్నకీ దో రూపాయి
చెల్వవుంది భాయి మీరు కన్పటి వుండ్వాలి.

రామ — సరే! యిదిపుచ్చుకొని సంతోషించి నాకార్యము చక్క
బెట్టండి. (అని వందరూపాయీల నోటుయిచ్చును.

లద్దూ — మాకూ హల్లాదయా వల్ల హింతా హన్నం పెట్వించే సంతో
షం, సంతోషం మహారాజ్ మీదుపని మూకుచిటికెల్ లోకి
మరగయా సేస్తాన్ మీకు పర్వా, గిర్వానై.

రామి — (తనలో) యీ రామనాథం గడు చోడనుకున్నాను. గాని యిం
త వెర్రి వెంగలప్పయుండబోడు యీ తురకోడు డబ్బాల్లో
దగుల్కొని ముండకోసము వందరూపాయీలు పీడివళ్ళో
బడసేడు యీసాయబుగాడు నికారుఅనుకున్నాను. గాని
యీడు కల్తీరక మోడే యీరోజులలో లత్తుకోరులమ్మిడీలకె
కొంత ఆటసాగుతుంది నిజంగా బొమ్మ్యే మాలాంటి యవారత్తు
లకేముంది యేమొవారమేకుద్దామన్నా కన్నొదుచుకొని కాల్లి
రుసుకున్నా కానీకనబడదు. అందుకోసం అమ్మకాలెత్తిపెట్టే
గందా శ్రీరాముని దయచేతను అని యీరామనాథం రంకె
వారంలోకి రంకేసేను. యేంజరుగుతుందో చూదాం! (ప్రకాశ
శముగా) రామనాథంగారూ! నాకు శెలవిప్పిస్తారా? నేనింటి
కెల్తాను.

రామ — శెట్టిగారు, మీరుకూడా యీ కార్యములో సాయంజె
య్యాలి.

రామి — ఏమిసాయం చెయ్యగలను డబ్బుసాయం చెయ్యడానికి డబ్బు
లేదుగందా, యిక మాటసాయంజెయ్యాలి.

రామ — మాట సాయమేగాదు మీ యుక్తినంతయు నుపయోగించి
బలేరావు నిందిరలను బరిమార్చి నామనసంతోషమును బెట్ట
వలయును.

రామి—ఓసోసి! బలేశావు నాచేతబడి బ్రతుకుతావా? నాశౌర్యం నాబలం నాయుక్తి మీరెరుగరండీ!

సీ. నక్కపరిగెట్టెడి ♦ బక్కదొంగలనెల్ల
దక్కడుచ్చుకు దరిమి ♦ దరిమి గొడితి
నాకు మాఅయ్యకు ♦ నేశికాడొచ్చింది
పీపుచితికేలాగు ♦ విసిరినాను
పుల్లిపాయలపులుసు ♦ నల్లికంశేసింది
అత్తప్పమొకమున ♦ నట్టెగొడితి
చింతపండులోను ♦ చిట్టెలుక పుచొస్తె
చీరేస్తి దాని చ ♦ ర్మంబు నేను.

గీ. జావమోదితె వస్తాదు ♦ జచ్చినంత
బరులుజేసితి పరువు ♦ లోకుండ నేను
కోపమొచ్చినదంటె నా ♦ కొల్లుదెలదు
వీశెరాళ్లెల్ల వీధుల వెంట ♦ నెగురూ॥

మాశౌర్యము, మాయుక్తికి మించినవారులేని ప్రఖ్యాతి పొందినాము గందాఅండి అడవిలో పెద్దపులి ఎంతలోకువో పూళ్లో కోమటంత లోకువండి ఎర్రిమొకాల కేందెలుస్తుంది కోమటి పిరికంటారు.

గీ. పూకచేగొడితె పూరంత ♦ నోరువెట్టి
నాదుభార్యకు దెలుసు ♦ నాదుశౌర్య
సాహసంబిక మాయింట ♦ జచ్చెనుగద
యుక్తిసత్తువ దెలను ♦ అత్తప్పకెపుడూ॥

రామ—శెట్టిగారూ? మీయుక్తిశక్తులన్నియు సంపూర్ణముగ జూపి బలేరావు, యిందిరలను బంధించవలయును.

రామి—యీలాంటి బేరమంటే ఓపికట్టి మరిమొగురుతాను. మీరొ చ్చిన భయం నాకు లేదుగదా యేండి నన్ను మాత్రిం వకకంటి తో జూడాలిసుమా?

రామ—యిదిగో శెట్టిగారు యీపారితోషకము బుచ్చుకొని సంతో షించండి!

రామి—అబ్బే! నాకెందుకండి! (చెయ్యిజాపి) సరే యిత్తానన్నది పోనివ్వడమెందుకు తెండి! (రామనాథం యిచ్చు 100 నోటు యిచ్చును.)

రామి—ఆహా! ముండకోసము నందలు నెగురుచున్నవి. యింక ముం దుముందు మాబుర్రలెగురునేమో భయమగుచున్నది.

రాము—సఖులారా! నా కార్యము మీదిగా భావించి నాయందు మిత్ర వాంచల్యముంచి,

పంచచామరం. రండి రండిమిత్రులారా ♦ రెండుయామములకు
దండి బుజబలంబుజూపి ♦ మొండెబలేరావునీ
ఖండ ఖండలుగనుజీల్చి ♦ కలుకంటి నిందిరన్
దండనంబు జేసిమీరు ♦ దయతో నన్నుబ్రోవుడీ॥

శేష బలేరావున్న బంగ్లాకు మీరు పగలు రెండుయామములకు యుద్ధ సన్నద్ధులై వచ్చినచో నేనుగూడా నాయుధోపేతుడనై వచ్చి మనమందరము చుట్టుముట్టుదుము. నంత నెటుపోవుటకు వీలు లేక మనచే బలేరావు, యిందిరలు బట్టుబడుదురు. ఆపైని హత్యకు నాలోచింపవచ్చును. వెంకటాద్రినాయుడూ! బలే, జక్కని యూహ జేసితివి. తప్పకమనమందరము రెండుయామ ములకు రావలయును శెట్టిగారూ ఆడ్డూఖాన్ వెలిసినదా రా మనాధమునాజ్ఞ మనము రేపే బలేరావుని బట్టవలయును.

రామి—సరే! రేపివచ్చెదము. రామనాథంగారు శెలవిప్పిస్తారా

రామ—మంచిది వెళ్లిరండి!

(నాయుడు, రామిశెట్టి, లడ్డూ నిష్క్రమించుదురు.)

రామ—ఆహా! నిప్పటికి నామనశ్శాంతిగలిగినది. గాని లంచములక్రింద నెంతసొమ్ము వ్రయమైపోయినదో లెక్కలేదు. యీలంచము లనే, పిశాచములచే నెట్టి దివాణములు, నెట్టి సంసారములు మటుమాయమైనవి. నెంతగౌరవ పురుషుడైనను, నెంత సుగుణోరాసియైనను లంచమన్న నపరిమిత సంతసంబునొందును గదా?

సీ. సభలందు ధర్మంబు ♦ చాటిచెప్పెడువాడు
 చెయిచాచి లంచంబు ♦ చెక్కజేయు
దగవులందునజేరి ♦ సలదిప్పువాతడే
 యిరువైపు లంచాలు ♦ నెమరువేయు
సత్యంబుగొట్టల ♦ సమగొల్పు నుద్యోగి
 చాటులంచాలకై ♦ చెయ్యిజాచు
బియ్యవ్యయైన బా ♦ బయ్య పాగయుదిప్పి
 లా దెలసి లంచంబు ♦ లాగుచుండు
గీ. చిన్నయుద్యోగులను మాట ♦ జెప్పనేల
పావలాబేడయో చుట్ట ♦ పీక ముక్క
పొడుము పట్టెయో బుచ్చిన ♦ బొక్కచెక్క
జేతబెట్టిన మనమాట ♦ జెవినిబెట్టు॥

అయ్యో! నెంతకఠిన స్వభావులు, నెంత కుటిలమనస్కులు, నెంత క్రూరులు యీలంచగొట్లు.

ఉ. భూమిని బుట్టిలమ్మ యును ♦ భూషణముల్ దగనమ్మ వైన
సొమ్మును లంచ గాళ్లకును ♦ సాగిలి మ్రొక్కియు నివ్వఁ జన్న ఏ
స్వామియు గార్యమైన గొన ♦ సాగదు జచ్చి ధరిత్రి బడ్డ యీ
గాముల లంచగాళ్లకును ♦ గౌరవధర్మము లేదు ఎప్పుడున్॥

(నిష్క్రమించును.)

రెండవ రంగము, బంగ్లాయందు నొక సోఫాపై

(బలేరావు—యిందిరలు, ప్రవేశము.)

యిం—నాథా! యీ వేళ మీ సుందర ముఖారవిందము మారి, నవీనా కృతి బొందియుండుటకు కారణ మేమయి యుండును.

బలే—ఏమియు లేదు గాని, నా ప్రియమిత్రుడు సుందరరావు అపూర్వ మహిమగల మధుసీసా నొకటి నాకొసగి దీనిమహిమ జూడుమని ఎంతయో శ్లాఘించి చెప్పిపోయెను. నేను దీనిమహిమ ఎట్టిదో జూతమని దగుమాత్రము గ్లాసునందునిడి గ్రోలితిని నది మొదలు నా యొడలికి బలమును ఆనందమును, హాయిని గూర్చి సంతోష వీచికల దేలించుచున్నది. అందుచే నావదనవిందము నవీనా కృతి బొంది యుండవచ్చును. ఆహా! నెంతమధురవస్తువ దాని గుణంబు శ్లాఘించుటకు శతవత్సరములైనను పట్టునుసుమా?

యింది— నాథా! నది నేవస్తువై యుండునో జిన్నిపువ్వు తేనె గాదు గదా?

బలే—ఛీ! ఛీ! వెధవ చిన్నిపువ్వు తేనా దానియందేమి గుణగణ విశేషములున్నవి. దానియందేమియంత రుచియున్నది.

యింది—లేక, ఖండ శర్కర పానకంబేమో?

బలే—ఖండశర్కర పానకమా గడజాతివాడైనా గోరిలునా కాదు, కాదు విలువగల రసాయన శాస్త్రవేత్తలచే గనిపెట్టబడిన దివ్య మధురము గదా?

యింది—అట్లయిన గనిపెట్టితిని గులాభీ షరబత్తై యుండవచ్చును.

బలే—నీవుజెప్పినదానిలో నొక్కటియుగాదు నీవు తెలుసుకొనలేక పోతివి.

తే.గీ. ఖండజక్కెరకన్న ♦ కలకండకన్న
జుంటితేనియకన్నను ♦ జున్నుకన్న
యిక్షుఖండంబుకన్నను ♦ యింతినీదు
మోవికన్నను దీపి ♦ మేలుసుమదిర॥

యింది—(తనలో) గొంపదీసి సారాయిగాదుగదా! (ప్రకాశముగా) నాథా! మీరుకొంత మధువును గ్రోలితిరే దక్కినది నిచ్చుట నుంచితిర.

బలే—నదుగో యాబీరువాపైనున్న బాటిల

యింది—(సీసానుదీసి, చేతబట్టుకొని నాఘ్రాణించి ప్రకాశముగా) అమ్మయ్యో! ఇదిసారాయియే నాథా! యీపాడుసారాయిని మరగి నాగొంప నట్టేట గట్టదలచితిరా ఇంక నేనేమిజేతును. యీప్రాగుడి మీచేత నెట్లుమాన్పింపగలను. సారాయినవిన నాగుండెగుభేలుమని నీరగుచున్నదే? అయ్యో! యీసారాయి నభ్యసించి ఎంతమంది సంసారులు సంసారములు పాడుజేసుకొని సన్యాసులై సంచరించుచున్నారు, ఎంతమందిప్రాణములు గోల్పోయి పరలోకమలంకరించిరి.

సీ. మొరకవీధిని పెద్ద ♦ మేడగట్టినశెట్టి
జెడద్రావి వీధిని ♦ జచ్చియుండె
ఏటియొడ్డున పెద్ద ♦ తోటవేసినరెడ్డి
జెడద్రావి భార్యను ♦ జంపుకొనియె
మనవీధిలోయున్న ♦ మంగలి గుర్నాథు
జెడద్రావి జెలియల ♦ జబ్బనరికె
మీయింటి సందులో ♦ మీసంబు నెగదువ్వు
సాతాని జెడద్రావి ♦ సానిజంపె

గీ. భార్యల్లను దల్లిదండ్రుల ♦ బాధబెట్టి
యింటగలవస్తువులనెల్ల ♦ నీవకున్న
గత్తిజూపించి హత్యకు ♦ నెత్తుభుజము
ద్రాగుబోతుకు నెందైన ♦ దయయుగలదె!

ఎంతమంది విద్వాంసులు ఎగిరి గంతులేసి నాట్యరంగమందు దమ నట నా కౌశల్యంబుజూపి తుదకు యీపాడు సారాయినభ్యసించి గాత్రహీనులై, అంగహీనత్వంబునొంది, నిర్జీవ ప్రతిమరూపు ధరించి, నిలువున నీరై నిహమును విడచి, పరమున కేగుచున్నారు. ఆహా! ఎంతఘోరమారి యీసారాయి.

సీ. డ్రామయార్టిగునని ♦ డ్రాములకొలది
సారాద్రావి ♦ జగమందు జావలేదె
సినిమయార్టిగునని ♦ సీసాలగొలది
సారాద్రావి ♦ జగమందు జావలేదె
స్పేట్లుయిచ్చితిమని ♦ పీపాలగొలది
సారాద్రావి ♦ జగమందు జావలేదె
ఘనపాటకులమని ♦ గ్లాసులకొలది
సారాద్రావి జగమందు జావలేదె

గీ. జారమితిలేక ద్రాగి ని ♦ స్సాగులగుచు
గుండెలెల్లను నీరుగా ♦ గుళ్లిపోవ
నడుచుటకు శక్తిలేకను ♦ నడుమువంగి
గాళ్లునడబడి ఎప్పుడో ♦ ఘంటగొట్టె॥

బలే—ప్రియసీ! ప్రాణవాయువు నుగ్గబట్టి యింతసేపు యీసారాయినిగూర్చి, ఎంత శ్రమవహించి లెక్చరుగొట్టితివి ఇంక నీవాక్కున్ శ్రమదీర్చుకొనుము. వీరందరూ జారాయిద్రావి యేజచ్చిరా? జారాయిద్రావనివారు నుట్టిగట్టుకొని జావక నూగుచున్నారా! నెంతవెర్రిదానవు?

సీ. సారా గ్రోలనియట్టి ♦ సగరుండు యిపుడేడి
జాడగనపడకుండ ♦ జావలేదె
సారా గ్రోలనియట్టి ♦ సత్య హరిచంద్రు
జావక నిలచెనే ♦ జగమునందు
సారా గ్రోలనియట్టి ♦ సవ్యసాచియు నేడి
జిరకాలముండెనే ♦ జావకుండ
సారా గ్రోలనియట్టి ♦ సారంగధరుడేడి
జావకయున్నాడే ♦ జంచలాక్షి

గీ. జారాగ్రోలకయున్నను ♦ జారగ్రోలినను
జావునకు గారణంబు ♦ జంత్తైనలేదు
గాలమొచ్చిన యిరువారు ♦ గూలుచుంద్రు
నరుకు గీర్తియొానపగీర్తో ♦ నిలచియుండు॥

యింది—(తనలో) ఈయన నా సామవాక్యములకు లోబడడు కఠిన
ముగా బల్కిజూచెద (ప్రకాశముగా) నాథా! యింకనీారు
యీా సారాయిని గ్రోలుట మానరా !.

బలే—మానుటని పశాస్త్రముందున్నది. పశాస్త్రముజూచితివి.

యింది—దీనికి శాస్త్రముగూడ గావలయునా? బండితులుండవలయునా?

బలే—ఉండకుండ జారయొక్క జారాంశాము నెట్లు తేలును.

యింది—తేలినవరకు యీాజెకు జారాయిని మానరా !

బలే—ఎట్లుమానుదును దీని జారాంశము నెంతవరకో తేలినగాని విడు
చుటకు వీలులేదు.

యింది—అట్లయిన? యీా జారాయిని మానవని జెప్పుచుంటిరి. మా
నని పక్షమందు మీాదారిమీారు జూచుకోవలసినదే యిక నా
దారిని నేబోయెద (పోబోవును బలేరావు చెయ్యబట్టి నాపి)

బలే—యింతీ! యెంతమాటంటివి నీవె నాబహిఃప్రాణమనియు,
నావలపుల బరణివనియు నమ్మికొనియున్నవాడను. నీదారిని
నీవుబోయినచో నింకనాగతి యేమిచేయుదానవు?

ఉ. వీడితి బంధువర్గముల ♦ వీడితి భార్యనుబుచ్చికొక్కగా
వీడితి మిత్రవర్గముల ♦ వీడితి నాదుగృహంబువీటినిన్
వీడితిగాని నిన్ను విడ ♦ నాకట నాహృదయంబునొప్పునే
చేడెరో నాదుప్రాణమును ♦ సౌఖ్యముస్వర్గము నీవుగావటే॥

చెలీ! నిన్ను నొక్కనిమిషమైనను జూడకున్న నానేత్రద్వయములు
సాఫల్యమునొందలేవుగదా? నీయంగపరిష్వంగముచే జన్మ
పవిత్రమునొందించగోరి మన్మథ సంగరంబున నీతో హాటా
హాటీగా పోరి, మన్మథసామ్రాజ్యము నొందగోరితినే యిట్టి
నా ఆశలన్నియు నస్తమింపజేసి, నీవు జనిన నాకు యీ ప్రి
పంచకమెందులకు, నాజీవితమెందులకు నీకోమల చరణములకు
నినుమంత కంటకము నాటిన నాహృదయశూలమగుచుండునే
నీమీద నీగవ్రాలిన నామీద నాకసంబు విరిగిబడ్డట్లు భయ
పడువాడనే నీవే నాహృదయపంకజభృంగమనియు, నీవేనాజీవిత
మనియు జాగ్రత్స్వప్నావస్థలయందు నీధ్యానమే నిరం
తరము నమ్మియున్న నన్ను ఎడబాయుట ఎంత అన్యాయకర
మైనపని యేమిదిక్కునాకు.

శా. నరఘడియైననీవు గనుపింపక ♦ యుండిన నంధకారమా
సరసిజనేత్రి నామనముసంగతి ♦ నీవెరుగుండిచెయ్యనన్
నరగెననంచు నన్విడచిపోవుట ♦ న్యాయమెనాగ్రహంబునన్
నొరగెద నీపదంబులకు నీటుగ ♦ నన్ను బరిగ్రహింపవే॥

(అని యిందిర పాదములపైబడును.)

యింది—(లేవనెత్తి కౌగలించికొని) నాథా! మాటవరుసకట్లంటిగాని
మిమ్ములవిడచి క్షణమాత్రము బ్రతుకగలనా నాహృదయము

శతపత్రిక్కలై నెట్లు బరితపించుచున్నదో జెయ్యివేసి జూడుడు
సర్వకాల సర్వావస్థలయందు మీస్వరూపమును నాహృదయ
ఫలకమున నిర్మించుకొని మీపదధ్యానమును జేయుచుండు
దాననే నాప్రాణమే మీయాధీనము జేసి మీకు నిత్యసపర్యలు
సలుపుదాననే నేను మీకుయేమిలోటుజేసితిని.

సీ. టీ జేసి వేడియూప్మా ♦ కైముకందించి
ఆనంద మొందని ♦ హారిషించినాను
పచ్చకర్పూరంబు ♦ పరిమళించెడు గిల్లి
నీ నోటకందించి ♦ నిలచినాను
నేవేళకును మీకు ♦ నెంతగావాలంటె
యంతధనంబిచ్చి ♦ యలరినాను
చీమనక పామనక ♦ చీకటియనకను
నీపొందుకై ♦ పొంగినెగిరినాను
గీ. నీవు ఘడియైన నాయెదుట ♦ నిలువకున్న
యుగమువలెదోచి యేపని ♦ యాడకుండ
సంధిమెత్తినసందాన ♦ సంటిపలంట
దిరుగుచుందును నీమీద ♦ దీపిచేత॥

మనయిరువరకును భేదంబులేదుగదా? మీరుజనిన నేనును, నేనుజనిన
మీరును బ్రతుకగలమా?

గీ. మీరునేనును నొక్కటై ♦ మెలగినాము
తనువు వేరుగనున్నను ♦ తలపులొకటె
నిద్రయందున నీమీద ♦ నిలచుమనసు
నీవె నేనౌను నేనె ♦ నీవౌను నాథా॥

బలే — ప్రియసీ! నాఅంతరాత్మయొక్క అంతర్యము నీవు దెలుసుకో
లేకపోతివి. జెప్పెదవినుము.

ఉ. భూమియుగిద్దరన్ దిరిగి ♦ భాస్కరుచంద్రులు ద్రోవదప్పి నా
హిమగిరివేడినొందిన ♦ హిరన్మయుతాపాడలుట్టిబడ్డ
నామనముదిరుంగ నేర ♦ నది 'నీరజనేత్రి'రో నిన్న బా
యమినాంకుని పాదసాక్షి ♦ యికనెట్టివిపత్తులు నెన్నిగల్గినన్॥

ఖుంది — నాథా! నేననుగ్రహింపబడితిని నాయీను సతులలో నే
నుత్తమరాలనైతిని నింకమున కేళికాసదనంబునకు నేగుదము
రండు. (అని నిష్క్రమించును)

మూడవరంగము.

(ప్రవేశం రామనాథం, నాయుడు, లడ్డూ, రామిశెట్టి.

రామ — నాయుడుగారూ! యిదే బలేరావు నివాసయోగ్యముగా నేర్ప
రుచకున్న కేళికామందిరము. నిందే యిందిరతో సమందానం
దమును బొందుచు. సంతతము సంతోష సాగరంబున నీదులా
డుచున్నాడు. ఇంక మీభుజబల పరాక్రమములు మీవాక్ప
జృంభనాదులుపయోగించి సిందిర, బలేరావుల బంధించునుపా
యంబునాలోచింపుడు.

నాయు — ఆలోచించి! రామనాథం నేనుజెప్పినచొప్పున సీనాచరించి
న దప్పక బలేరావు మనకు బట్టుబడుటకు యేమాత్రము సం
దేహమూలేదు. యేమంటివా?

సీ. తూర్పువాకిట నీవు ♦ తొలగకనుండుము
పడమర లడ్డూను ♦ పదిలపరచు
నుత్తరంబున రామి ♦ వైశ్యుడుంచుము నేను
దక్షిణంబునుగాతు ♦ దొలగకుండ
నొక్కమాటుగ మనము ♦ నక్కి బలేరావు
బంధించి యిందిరను ♦ బట్టవలయు
జిన్నపెద్దలకును ♦ గన్నవారలకును
టముటమా జేయించి ♦ టక్కు జూపి

లడ్డూ—తూమ్. తూమ్. అది పెద్దలడాయి కాదు నిన్ను సుబ్బిచెట్టి మర గయ చేయాలి?

రా—అబ్బో చంపేయడమేనా?

ల—ఓ! మీజోడాలో నౌకరు మర్గయా కావాల?

రా—(తనలో) వచ్చినోడు ఈసాయిబుగాడు ఈదోసంములో బట్టి నన్ను చావజంపుతాడేమో? మొసక ఆవదం అరువులడిగితే యిచ్చేనుగానని నామీద కళ్లెల్లబెట్టి పళ్ళుబిట్టగరిసేడు ఎదవ లంచం యేడ్చేను.

నా— రామిశెట్టి రాత్రియెంతోలేదు వేకువయ్యాము కావచ్చినది బలేరావు బయటకువచ్చే వేళైనది. కడు జాగరూకతగా మెల గవలయును. నెంతమాత్రము మనము వెనుదీసినను దెబ్బదిన్న బెబ్బులివలె మనమీదబడి హతమార్చగలడు కడుజాగ్రతగా గాయవలెను. రామనాథం నీదిశను నీవుగాయుము. లడ్డూఖాన్ జాగ్రత్తగానుండుము. (అని దిశలను గాతురు.)

(ప్రవేశము యిందిరభాయి—బలేరావులు.)

యింది—నాథా! నేడేమోగాని నామనస్సంతయు కలవరమందు చున్నది. గుడికన్నును గుడిభుజమును అదురుచున్నది. నేడైదె నాం గీడుమూడదుగదా ఈమధ్యను రామనాథము తనమిత్రులతో సరుదెంచి మనయిరువురను బట్టి బంధింప నుంకించుచున్నాడని వినియుంటిని నతడు మన యిరువురను బట్టి బంధించునేమో యని భయమగుచున్నది.

బలే—ఏమేమి రామనాథమా? మనలను బట్టుట వెఱ్ఱిదానా! రామ నాథముగాదుగదా రాకుసాంతకుడైన నాయెదుటనిలువగలడా?

తే॥ గీ॥ పాణితలమందు పిస్టల్ ♦ నున్నవరకు
మేనబ్రాణంబు మీదికి ♦ నెగురువరకు
నిన్నునన్నును జెనకుట ♦ నజునికైన
వశముగాదంచు దెలియవే ♦ వారిజాక్షి॥

యింది—నాథా! మనధామముచుట్టు నేవియో రణవాక్యులవలె వినవచ్చుచున్నవి ఏమైయుయ్యంనునో?

బలే—ఏమైయుండును నీవన్నట్లు రామనాథ పరివారమే?

యింది—అమ్మయ్యో నేనేమిచేతును నేనెట్లు దాటిపోగలను నన్ను రక్షించువారెవరు నాథా రక్షించుము రక్షించుము (అని కాళ్లమీద బడును).

బలే—(లేవనెత్తి) తన్వీ భయపడకుము నీబలేరావు బొందిని ప్రాణమున్నంతవరకు నీదరినున్న గుసుమంబు వాడనియ్యడు (యిందిరను వెనుకనుంచుకొని ముందునకువచ్చి)

ఉ. అవురా శాత్రవులార మీ ♦ కడులు సుంతైనన్ మదిలేక యా
నవనంబున్ దరిజొచ్చు మే ♦ షముల బంగీన్ జావనేతెంచిరే
శివకంటిన్ దరిగొల్ప నెం ♦ చితిరె భార్యా బిడ్డలన్ బాసి నా
పవిఖడ్గాహతులొాటటం ♦ చు బరమేష్టి వ్రాసెగాబోలునే॥

నాయు—ఓరోరి వదరబోతా! నీవెంతవదరినను నీయంతముజూడక విడువము! నీడాంబిక వచనములకు లోబడువారముగాము నివతలకు వచ్చి నిలచుండి మాట్లాడుము.

బలే—ఔరా! నాయుడా! నీవుబన్నిన బన్నుగడయానిడ! ఓరోరి నిర్వ్యాపారత్వహీనా! కలుషాత్మా

గీ. మతులు మాన్యంబులెల్లను ♦ మంటగల్పి
భార్యదెచ్చిన సొమ్ముచే ♦ బ్రతుకునట్టి
బానిసవిగావె నీవ్రజ్ఞ ♦ బలిమిగూడ
దెలుసుమాకిక మాదెబ్బ ♦ తెలియుమికను॥

నాయు—ఓరి! త్రాగుబోతా! జారచోరత్వపారీణా నేమిరా నీపొగరుబోతుతనము.

గీ. దల్లిభార్యల బడమోది ♦ దలలుగొట్టి
జారగడుపార జెడదాగి ♦ జోగితిరుగు
జెనటి నీయొక్కదుశ్చేట ♦ జటికిలోక
బణతుజూడర నాయొక్క ♦ బాహుబలము॥

బలే—ఓరి ప్రగల్భ! నీకు బాహుబలమున్న గాచుకో నిదేవచ్చు చున్నది నాపిస్టల్ దెబ్బ! నీకెవరడ్డొచ్చెదరో జూచెద (అని పిస్టల్ తో గొట్టును). వెంకటాద్రినాయుడు బడిపోవును.

రామి—ఓరయ్యల్లో యీ దెబ్బతో ఆకరుఅయ్యేనర్రో (అని కేకలెట్టి క్రిందబడిపోవును.)

రామ—హారే! దుర్మార్గా నెటకేగెదవురా నిలు నిలు

లడ్డూ—హారే! రామనాథం జల్దీ, జల్దీలడాయికీ మార్, మార్.

అనియిరువురు బలేరావుని వక్కపెట్టున మీదబడి బంధింతురు.

నాల్గవరంగము.

ప్రవేశం. అపవాదుడు.

అప—(తనలో) నిచ్చట నెవ్వరో వికటట్టహాసములచే విరాలాపముల తో సమరసన్నద్ధులై జయాపజయంబులు నిర్ణయించుచు న్నారు. నెవ్వరైయుందురో జూచెద. ఓహో! రామనాథ బలేరావులకే కయ్యమొచ్చి కల్పటమాచున్నారు. రామ నాథమును బురెక్కించి బలేరావుని బంధించుటకాలోచించ వలెను. (ప్రకాశముగా॥ రామనాథమా! బలేరావుని బోనియ్యక బంధింపుము వీడు గ్రూరమానసుండై బురంబును మొనగాడై మురియుచూ దిరుగుచున్నాడు. వీనిని దోడ్కొని జెరసాల బంధింపుడు. (బలేరావుని బంధించి దోడ్కొని రామనాథ లడ్డూఖానులు నిష్క్రమింతురు.)

అప—(తనలో) యిందిరనుజూచి॥ యీ చిన్నదెవ్వతెయుండును శిరము వంచి సిరోజములు నీడ విలపించుచున్నది. మాయిందిరను బోలియున్నది. గొంపదీసి మాయిందిరగాదుగదా! నిదానించి

చూచి నేననుకొన్నట్లు నాజెడిపియే అవురా నెంత అమర్యాద సంఘటించెను. నేనేమి జేతును. (కోపముతో)

ఉ. శూర గులంబునందు నతి ♦ సౌఖ్యముగా దగబుట్టి నీవు యీ ఘోరపిశాచరూపమున ♦ గ్రూరత మాదు గుటుంబ మంతయున్ నిర్మూలము జేయ నెంచి గు ♦ ణనీతి వివేకములెల్ల బుచ్చి యీ కూరమతిన్ జరించి నప ♦ కీర్తియుగూర్చిన దోషురాలవే॥

ఛీ! ఛీ! దుర్మార్గురాలా నెలువంటి వంశమునకు నెట్టికళంకము దెచ్చి పెట్టితివే. నీవు సన్మార్గురాలవనియు సాధుమతివనియు నమ్మి తినిగాని యిట్టి చెడుమతివని దెలిసినచో నిన్ను అంత మొందిం పకపోతినా అయ్యో! నింక నేనెట్లు యీ అపవాదంబునకు సహిం చి ఎట్లు దిరుగాడుదును యేమని దలయెత్తుదును.

సీ. నలుగురులోపల ♦ దలనెత్తిదిరిగినా
సవ్వరా బంధువులు ♦ నన్నుజూచి
వీధికెళ్లిననన్ను ♦ యీసడింతురుగాని
వెనకటిమర్యాద ♦ విధముగాదు
సభలందుననుజూచి ♦ జచ్చుపీనుగవచ్చె
నను లెక్కగొనరు ♦ ననొక్కరైన
జట్టాలముఖము నే ♦ నెట్లుజూతునుయింక
మరియాదయన్నను ♦ మంటగలసె

గీ. ఇరుగుపొరుగువారు ♦ యీసంగతివినను
జగడమొచ్చినపుడు ♦ జాటుచుందు
యిట్టి గులటులున్న ♦ నెట్టి వారలకైన
హానివచ్చు పాపిణ ♦ హాసిదెచ్చూ॥

ఇంక నేనెంత వంతనొందినను నంత షోషయేగాని కార్యములేదు నిది యంతయూ నాస్వయంకృతాపరాధమే ఏమనుటకు వీలులేక యున్నది.

సీ. దగినసంబంధంబు ♦ దగిలి నడిగినయపుడు
నివ్వకబోవుట ♦ నాదిలోటు
తరుణి నొరునకు నొసగ ♦ దరుగు ధనంబని
నామనంబున దలచ ♦ నాదిలోటు
మనసుతకును బెండ్లి ♦ మరిజేయుమనిచెప్ప
నాతి నాక్షేపింప ♦ నాదిలోటు
నీ కూతునకు పెండ్లి ♦ నెప్పుడు జట్టాలడుగ
నిపుడుగాదంచెదు ♦ నాదిలోటు

గీ. నిన్నిలోటులు నాయందె ♦ నిమిడియుండె
ప్రియమొచ్చిన గన్యను ♦ పరగనింట
నుంచుటయు దల్లిదండ్రిల ♦ లోటుగాదె
దగినవరునకు సమకూర్చి ♦ దనర లేక.

యింకజేయుటకు గర్తవ్యమేమియు గానకున్నది. యీగులటను యింటికి గెంటుకొనిపోయి నటు నిటు దిరుగాడకుండ గారాగారావాసిని జేసెద. యిందిరా! యింక నాలస్యమెందులకు పద పద
(అని చెయ్యిబట్టుకొని గెంటుకపోవును.)



# గుండె గుభేల్.

## చతుర్థాంకము.

### ౧వ రంగము.

గజపతిలాల్ కోర్టు:—గజపతిలాల్ సింహాసన మధిష్ఠించియుండును. యిరుప్రక్కల తిరుపతిరావు, వీరేంద్ర శేఖరులుందురు.

గజ—ఏమండీ! తిరుపతిరావుగారు! నెంతకాలమునకు యీ భరతమాతకు చుట్టుముట్టుకొనిన బలుకష్టంబులు వీడెను! ఏమంటిరా?

సీ. బాల్యవివాహములు ♦ భస్మంబులను జేయ
శారదాబిల్లేర్చె ♦ జెసలునందు
బాల్యవితంతువుల ♦ పెనుబాధలనుదీర్చ
పునరవివాహములు ♦ వృద్ధినొందె
పూర్వపరాయణులు ♦ బోయమూలను జేరి
గళంట నీళను ♦ గార్చునుండె
నామోదసంఘంబు ♦ నమోదమున బొంద
నిరసనసంఘంబు ♦ నింటదూర

గీ. పుష్పవతులును వితంతు ♦ బాలికలను
బల్లకీలెక్కి నూరేగు ♦ భాగ్యమబ్బె
ధర్మదేవత నేటికి ♦ దయదలంచి
భరతమాతకు బంధులై ♦ బయలుదేరె॥

ఇంతటనుంచి మన భరతదేశంబు జక్కనిఫలపుష్పాలతో నిండి కలకల నాడవచ్చునుగదా.

తిరు— నిజమే తమరు జెలవిచ్చినట్లు మన భారతరాజ్యంబున రజోవతి అనంతరమందు అనగా చతుర్దశ వత్సరంబులకు బాలికలకు బరిణియంబు జరుపవలయునని శారదాబిల్లును బాలవితంతువులకు బరిణిగా మహోత్సవములు జక్కగా జరుపవలయునని సంఘసంస్కర్తలు దొరికించుకొనుటచే పూర్వాచార పరాయణులకు మొఖమువాడి కొన్ని చిక్కులు దటస్థించినవి నవి ఏవంటిరా ?

సీ. కన్యవిక్రియులకు ♦ కళ్లలోకారంబు
వరవిక్రియులకును ♦ వెన్నుపోటు
ముసలి వరడులకును ♦ మూలశంఖవిధంబు
పెండ్లిపెద్దలకు ♦ వాక్కు.బంధనంబు
అమ్మవియ్యంకుల ♦ అతిసారరోగంబు
బంధువులనోటను ♦ బెడ్డముక్క
వితంతు జనముల ♦ కింతపెన్నెలయిది
బాలికలు బవళించు ♦ బర్మజోలి

గీ. యగుచు ధర్మంబు నానాటి ♦ కెచ్చుయగుచు
నాటికొక్కటియే వితంతు ♦ వుండుగాని
పుడమినంతయు పుణ్యా సు ♦ వాసినీలతో
భరత దేశంబునంతయు ♦ బరిమళించు!

గజ— సరియే నికమన ఆంధ్రదేశమంతయు సమందానందమును బొందుచుండవలసినదే.

తిరు— చిత్తము.

గజ— ఇప్పుడు టైమెంతయునది.

వీర— 11 గంటలే అయినది.

గజ— అట్లయిన యీరోజున మనము దీర్పవలసిన వ్యాజ్యములు ఏమియున్నవి.

తిరు— లేకేమి! దిలనాసికం తాలూకు 1928 నెంబరు దావాతీర్చవలసియున్నదిగదా ?

గజ—అట్లయిన పిలిపింపుము.

తిరు—అరే! ప్యూన్ తిలనాసికం మృత్తికేసులగార్లను పిలువుము.

ప్యూన్—(పిలచును) తిలనాసికం. తిలనాసికం. తిలనాసికం.

తిల—అయ్యా! అయ్యా! వస్తూయున్నానండి.

(అని చేతులు జోడించి నిలబడును.)

తిరు—ప్యూన్, మృత్తికేసుని బిలువురా?

ప్యూన్—మృత్తికేశ్వరం, మృత్తికేశ్వరం, మృత్తికేశ్వరం అని పిలచి హాజరులేదండి?

వీరే—ఏమది యీరోజున హాజరింకని దెలియదేము

తిరు—తెలియకే వీధికొచ్చిన అపవాదని చాటియుండవచ్చును ఓరే శంబా నీవువెళ్ళి మాయాజ్ఞ తెలియపర్చి మృత్తికేశమును దీసుకరా?

శంబ—బాబయ్యగారు! మా ఆడది సంతకెళ్ళిందండి గెంజికోసము ఆసించేనండి అందుకీడిగిలడ్డానండి.

తిరు—గాదురా మృత్తికేశమును దీసుకరా.

శంబ—గడ్డుముండండి! నే యెల్లొండంటి! సంతలో కేడ్చిందండి

తిరు—ఓరి! చెమిటివెధవ మృత్తికేశముని దీసుకరారా.

శంబ—చెవినొగ్గి ఏటండిబాబయ్యగారు యింకాఆరలేదండి ఆరగానే కుట్టితెత్తానండి.

తిరు—జోడుగాదురా మృత్తికేశముని.

శంబ—అబ్బో అంతబేగిఆరతాయి వూకేసునుగందా తీసిఆరేత్తాను.

వీరే—చెమిటివెధవకు వినబడదు మనదగ్గిర టిలోఫోన్వుంది వీనిచెవి దగ్గిరబెట్టికొమ్మనిచెప్పి మరీచెప్పుము.

తిరు—టిలోఫోనుగొట్టమును దెచ్చి, శంబకుచెవిలో జెప్పును.

శంబ—(ఆలకించి) సరేనండి యింతసేపూ నన్నూరికే సంపేసేరుగందా అప్పుడే నీగొట్టాం నాచెవిలో బెడితే ఆజాయిని మృత్తికేసు గారిని మూడుగడిల్లోకి లాక్కురానండీ!

తిరు—సరే నీకవెళ్ళు వెళ్ళుము.

శంబ—ఏమండీ లాక్కురావద్దూ

తిరు—తీసుకరా అని చేసంజ్ఞ జేనును. (శంబడువెళ్ళును).

(ప్రవేశం—శంబడు, మృత్తికేశ్వరము.)

తిరు—ఏమోయి మృత్తికేశ్వరం ఈవేళ మీకేసు హీరంగని తెలియదా ఏమియింతనాలస్యము జేసితివి.

మృత్తి—వీదంట రాలేక సిగ్గుచే మూలబడి ముగ్గుచున్నానండి.

గజ—ఏమోయి నీవంతమూలబడి ముగ్గుటకు కారణమేమైయుండును. నీకొమరుకు జేసిన కార్యమునకా?

మృత్తి—అయ్యో! బాబయ్యగారు మరియానస్తునకు నమర్యాద తటస్థించినపుడు మూలబడి ముగ్గక నింకేది తెరవు.

గీ. దుష్టుడైనట్టి దుర్యో ♦ ధనంతవాని
గనియు గౌరవపతియు ♦ గృసించలేదె
సజ్జనుండును సుగుణు ♦ సారంగధరుని
గాంచి రాజనరేంద్రుడే ♦ గుందిజచ్చె॥

మృత్తి—సన్మార్గపుత్రునివల్లగాని, దుర్మార్గపుత్రునివల్లగాని తండ్రికి సుఖముమాత్రము గన్పట్టదు శత్రువులే పుత్రరూపంబున బుట్టుచుందురని ధర్మశాస్త్రవేత్తలు జెప్పుచుందురుగదా తమరు ధర్మస్వరూపులు దమకుదెలియని ధర్మములులేవు తమరు నాయాన్యాయములు విమర్శించి నాకు నాయము దయచేయ గలందులకు ప్రార్థిస్తూయున్నాను.

గజ—(తలయూచి) సరియే తిలనాసికం నీవేమిజెప్పుకొనెదవో జెప్పుకొమ్ము.

తిల—(తనలో) ఏవిధముచేతనైన గొన్నిమాటలు గల్పనజేసి యీ మృత్తికేసుగాడిని మూడుచెరువులనీళ్ళు ద్రాగించి వీనికొమరుని వూరునుంచి సాగనంపినగాని, నామనంబు నూరటజెందదు. (ప్రకాశముగా) ఏలినవారితో జెప్పుటకేమున్నదిబాబు అంద

రిలోకి నథముడనైతిని, ఆక్షేపణలకుపాలైతిని దలయెత్తికొను
టకు వీలులేక దలుపుచాటున మ్రగ్గుచుంటిని.

గజ—సరియే యింకజరిగినదానికి విచారించిన లాభంబులేదు మృత్తి
కేసు గోమరుడు నీకు ఏమి కష్టనిష్ఠురములు గలుగజేసెను.

తిల—ఇంక తమ సన్ముఖమున బడినప్పుడు జెప్పక తప్పుతుందా బాబు?

సీ. మాపిల్ల సందులో ♦ మసలుతునుండంగ
మాట రమ్మని కన్ను ♦ గీటినాడు
ఏటియొడ్డుకు ♦ నీటికోసమ్మె వెడలగ
యీలగొట్టియు వెంట ♦ నేగినాడు
వేకువఝామున ♦ వీధినోకరి గూడ్చి
నామాట ఏమని ♦ నవ్వినాడు
పొరుగువారింటికి ♦ ఎరువవన్నునకరుగ
దారిలో చెరబట్టి ♦ దాగినాడు

గీ. నిట్టియాగడములు నీశ ♦ నివృత్తించు
జేయుచుండ నెట్లు ♦ జూతుమండి
న్యాయకర్తలు గనుక ♦ న్యాయంబు దయజేసి
మమ్మునుద్ధరించు ♦ మాన్యచరితా॥

గజ—దలయూచుచు! సరియే? నీవుజెప్పిన పనులన్నియు నాతడు
జేసినమాట సత్యమేనా నిందసత్యమేమియు లేదుగదా?

తిల—తండ్రి! యిందసత్యమేమియులేదు యింకను అనేక దుండగ
ములు జేసెను. గాని అవి అన్నియు నుదమతో మనవిజేసిన
నాలస్యముకు జేటనియు జెప్పలేదు.

వీరే—న్యాయమూర్తులారా! యీ అభియోగంబునయున్న సారాం
శంబు గ్రహించి న్యాయాన్యాయంబులెట్లుండునో నిరూపిం
చి సెలవివ్వగలందులకు గోరుచున్నాను.

గజ—సభికులారా! యీ నలుగురు సభిప్రాయముల ననుసరించి నాకు
తోచినరీతి న్యాయంబు వరించువాడను వాదినైన తిలనాశకం

జెప్పిన హాంశములనుబట్టి ఆలోచించగా నితని గృహ దరిద్రావు
ననే ప్రతివాది గృహముండునని జేసి వాది ప్రతివాదులకు ఐక
మత్యము జనువుగలిగి యుండుటచేతను వీరి సుత సుతలకు జను
వు అయికమత్యము గలిగియుండవచ్చును. అందుచే వాది సుత
తో ప్రతివాదిసుతుడు శ్లో॥ "కామాంధకారే దివమంధకారీ"
అన్నట్లు కామాంధకారముచే దిరుగుచున్న వానికి పగలే గుడ్డి
తనము వచ్చును. అందుచే వాదియొక్క కన్యను వలచి పడుదుడు
కు పనులుగొన్ని జరిపియే వుండవచ్చును. వాది, ప్రతివాదు
లిద్దరున్నూ మరియాదా కటింబీకలాటచేతను వీరి మరియా
దాకు యేవిధమైనలోటు జరుగకుండుటకుగాను ప్రతివాది
తనయుని నిటకు రప్పించి ప్రధను తప్పిదముక్రింద క్షమించితి
నని జెప్పి యిటుపైన నిట్టి దుండగములుజల్పిన ఖటిన దండనకు
పాత్రుని జేతుమని జీవాట్లుపెట్టి మందలించివదిపివేయడమే నా
యభిమతము.

తిల—(తనలో) చీవాట్లు బెట్టి వదలడమేగాని శిక్షించరుగా బోలు
ఛీ! ఛీ! యీగోర్టులు దిరిగినవారిని సిగ దెగ్గోయ్య వలసినదే
డబ్బుఖర్చేగాని ధర్మమూ న్యాయమూ లేదు.

లడ్డూ—(ప్రవేశం తొందరగా) సలాం, సలాం మహరాజ్ ఙదాపూరీ
పెద్దానాయుడుకీ, బల్లేరావుకీ లడాయిబడాయించి హజామత్
హయేర్

గజ—ఇద్దరూ చనిపోయిరా

లడ్డూ—లేద్ లేద్ మహరాజ్ నాయ్డుకే మరగయా

గజ—బలేరా వేసుయినాడు.

లడ్డూ—హుడా యుంచి దొడుదిసేడ్ మహరాజ్

గజ—సరియే నికనీవెళ్లుము.

(లడ్డూ నిష్క్రమించును.)

గజ—జూచితిరా మనవీట నెట్టి విడ్డూర్యములు జరుగుచున్నవో
హత్యలుజేయుటకుగూడా మొదలెట్టిరి నింక మననగరము నిలు
చుట కష్టముగదా ?

తిరు—అయ్యో! మన కమలాపురంబున గడువింత తుంటరులు దంట్లై
ఘోరకృత్యములకు గోరింతైనా వెనుదియ్యక పాపమననేమిటి,
పుణ్యమననేమిటి జూపుమని గొంతమంది తుచ్ఛులు చర్చించు
చున్నారు. రామాయణాది పుణ్యగ్రంధములు జదివినను,
వినినను పాపమని గొంతమంది వాచాటులు వదరుచున్నారు.

గం—ఏమేమి ? పుణ్యాస్పదంబగు రామునిచరితము వినుట పాపమా!
మనవీటను బుణ్యంబు నశింపంజేసి పాపంబును బెంచదలచితిరా!
ఆహా నెట్టి కుటిలమానసులు ప్రబలిరి.

సీ. సగ్రంధములు నెల్ల ♦ జక్కగా జదివించి
పండితు బత్య ♦ మెండిచునొకడు
ఫలపండములుగొట్టి ♦ ఫలముల పిప్పల
దనియింప నేడ్చు ♦ దద్ధమ్మయొకడు
ఎల్ల వృషభములలో ♦ బొల్లెద్దు పెద్దని
పిరుదులును దువ్వు ♦ పీనారియొకడు
జూటమాటలుజెప్పి ♦ జాటించి దనప్రజ్ఞ
దుదకు బుర్రొత్తసి ♦ దొమ్మరొకడు

గీ. దల్లిదండ్రులనేడ్పించు ♦ దట్టములుగ
జేతునంచును దలద్రిప్పు ♦ జెవటియొకడు
నిటి తుంటరులెల్ల మన ♦ వీటనందు
ప్రబలుచున్నారు యమునకు ♦ బంటులగుచూ॥

ఆహా! నెంతలో మన కమాలాపురంబునకు నెట్టిదుర్దశవచ్చెను.

వీరే—దుర్దశయేగాదు అంతర్దశకే వచ్చియున్నది. జెప్పెదవినుడు.

సీ. నొకచోట పందెంబు ♦ నొకచోట పేకాట
నొకచోట జూదంబు ♦ నొక్కచోట
గంజాయిదాగుట ♦ గల్లుదాగుటయును
నొకచోట బొమ్మలయు ♦ బొరుసునాట
నొకచోట చోరులు ♦ నొకజోట జారులు
నొకచోట దొంగ ♦ అర్జీలువ్రాత
నొకచోట తార్పులు ♦ నొకచోట తీర్పులు
నొకచోట కుట్రలు ♦ నెన్నుటయును

గీ. ఇంతకును మూలమే మన ♦ మూరకొన్నట
నొక్కనైనను బట్టియు ♦ వెక్కసముగ
బొండనేసిన యూరిజన ♦ బండజాతి
బుద్ధిగల్గియు మనయూరు ♦ బాగుపడదే॥

గజ—ఇంతకును మన అసమర్థతజూచియే మన పురవాసులు దుర్మార్గ వృత్తులనవలంభించి గండడు మిండడైనట్లు దిరుగుచున్నారు. నేటినుంచి నెచ్చట జూదపానంబులు జేసినను, నెచ్చట పేకాట పందెంబులాడినను లాటీప్రయోగంబులజేసి జెరసాల జేర్ప మని మనగ్రామనాథులకు నాజ్ఞనొసంగుడు. నింకబలేగావు సంగతేమొ విచారించవలసియున్నది. గనుక మనమేగుదము రండు.

(అందరూ నిష్క్రమింతురు)

(రెండవ రంగము, కమలాభాయి—కంజాక్షి ప్రవేశం.)

కంజా—అమ్మా! కమలా! సతులకు నేయే వ్రతములు జేసిన సద్గతులు గల్గి మోక్షమును బొందుదురో నట్టివ్రతమున్న యెడల ఆన తియ్యగోరద ?

కమ—కంజాక్షీ సతులకు బతిసేవకన్న వ్రతమున్నదయా పతియే దైవమని నమ్మిన సాధ్వీమణులకు సద్గతులుగల్గి, మోక్షమును పొందుటకు యే అభ్యంతరమూ లేదుగదా ?

ఆ. గుడ్డివాడైనను ♦ గూనివాడైనను
గూలివాడైన ♦ గురూపియైన
గుష్ఠువాడైన రో ♦ గిష్ఠువాడైనను
గతికి భర్తగాడె ♦ సతికినరయ॥

పతిభక్తికన్న వ్రతము సతికి యింకొక్కటిలేదు గొంతమంది మూఢ సతులు నుపవాసములుసల్పి జిత్రగుప్త నోమనియు, పడిపువ్వుల నోమనియు, నింకనెన్నో నోములాచరించి తుదకు దుర్గతిని బొందుచున్నారు. గాని, పతులకు బతిభక్తియే బరమ వ్రతము నది యే హరిహరాదులకు నందనివస్తువై ననేకమహిమలు గల్పించుచున్నది.

సీ. హరిహరు నజులను ♦ ననుగు గుఱ్ఱ
నాడించె గాదె నా ♦ యత్రి సతియు
యమునడ్డగించి ♦ యాత్మేను జీవమునిల్పి
దండ్రికి సావిత్రి ♦ దనయులొసగె
నర్కుని శాశించి ♦ నతివసుమతీ దేవి
బతికి గుష్ఠువుమాన్పి ♦ ప్రాణ మొసగె
నమరులు వెరగొంద ♦ ననలంబులోజొచ్చి
సీత రాముని మనః ♦ సంధిమాన్చె
గీ. నింక నెన్నెన్నొ మహిమలు ♦ నిలను జూపి
మూడులోకంబులకును ♦ ముజ్వోల్పులకును
జడినిగల్గించి యా పరం ♦ జ్యోతినందు
భర్తతోడుతలయమైరి ♦ భక్తిచేత॥

కంజా—మీరుజెప్పిన యీ బతివ్రతలు కృతయుగ, త్రేతాయుగ, ద్వాపార యుగములనాటివారు గాని ఈ యుగమువారుగారు నిట్టి బతివ్రతలు యీ గలియుగమున లేరని నాయభిప్రాయము.

కమ—ఏమే కంజాక్షీ ఎంతవెఱ్ఱిదానవు కలియుగములో బతివ్రతలు లేరనియా నీయభిమతము బతివ్రతలు లేనిపక్షమున నీబ్రహ్మాండము బగులునుగాని నిలుచునా?

కంజా—తల్లీ! నిట్టికలికాలంబున బతివ్రతలను నెచ్చటను గాంచలేదు నెచ్చటనుంటిరోగదా?

కమ—కంజాక్షీ! నీ కలికాల బతివ్రతలను నీవెరుగవా జెప్పెదవినుము.

సీ. రాణ్మహేంద్రంబున ♦ రాజిల్లుచున్నట్టి
గాంత బతివ్రత ♦ గన్నమాంబ
సామర్లకోటను ♦ సాక్షిభూతంబైన
గాంత బతివ్రత ♦ కామమాంబ
సాలూరుబురమున ♦ సత్యంబు నెలగొల్పు
గాంత బతివ్రత ♦ గాసులాంబ
గొత్తపల్లందున ♦ గోరికలొనగూర్చు
వింత బతివ్రత ♦ వీరమాంబ

గీ. నింక బుచ్చెమ్మ జక్కని ♦ నరసమాంబ
సుబ్బమాంబయు సూరియు ♦ చెన్నమాంబ
భారతావని బుట్టిన ♦ బరమసతులు
నగ్నిగుండంబులందునే ♦ నణగినారు॥

బతిభక్తియే నాధారంబుగా జేసుకొని బరమ పతివ్రతలై బ్రళయాగ్నినందు బ్రవేసించి అగ్నిదేమునకు నాహుతులై అనేక మహిమలుజూపించి, ఆలయంబులు గట్టించుకొని అపరదేవతులవలె వెలుగుచున్నారుగదా?

కంజా—తల్లీ! యిట్టిమహిమగల పతిభక్తి నేవిధంబున నాచరించిన నలవడునో నానతిచ్చి నన్ను గృతార్థురాలనుగా జేయుము.

కమ—కంజాక్షీ! యీ బతియొక్క వ్రతమునకు నితర వ్రతములవలె గష్టసాధ్యములగు నుపవాసములు చేయనక్కరలేదు, ధూప, దీపనైవేద్యములు, దక్షిణతాంబూలములు, విప్రోత్తములు

నుండనక్కరలేదు. పతికి తన ప్రాణనాథుని పాదారవిందములు
తన హృత్కమలమందు జక్కగ నారాధించడమే పతివ్రతము.

చ. అనయము భర్తపాదముల ♦ నాత్మను నిల్పియు బూజజేసియున్
వినయము నత్తమామలకు ♦ వందనముల్ దగ జేసినట్టి యా
వనితియె సత్పతివ్రతయు ♦ బుట్టినయింటికి మెట్టినింటికిన్
ఘనమగు కీర్తి దెచ్చుమను ♦ గందగజాలును మూడులోకముల్.

కంజా—అహా! ఏమి మీ వాక్సుధారసంబులు నాకర్ణ రసాయనంబు
లగుచున్నవే నాకు పతిభక్తి జక్కగనుపదేశించి నాజన్మతరిం
పజేసితివి తల్లీ యింక నేనున్నన్యాలకైనని రేపు వుదయంబుననే
మీ పాదదర్శనము జేసి, మీ పుణ్యవాక్యంబులు నాలకిం
చెద అమ్మా నీపాటికి నాకు సెలవిప్పించెదరా?

గీ. పడుగో భానుండు నపరాద్రి ♦ నరుగుచుండె
సంధ్యరాగంబు సమకూడె ♦ సమయమయ్యె
బ్రాణనాథుని పదపద్మ ♦ బూజజేయ
నరుగవలెనమ్మ నాకు న ♦ నుజ్ఞనిమ్మా॥

కమ—అమ్మా! నీవు తొలిజన్మంబున నెట్టిసుకృత కార్యంబునాచరిం
చితివో, నెట్టి మహాపుణ్య దానంబులు జేసితివో గాని నీభర్త
పాదసేవజేయుట నీకు లభ్యమైనది తల్లీ నేనెట్టి ఘోరకృత్య
ములు జరిపితినో, నెట్టి దంపతులను విడదీసి నవ్వి ఆనందించితినో
గాని నాపతి నన్నెడబాసి రెండువత్సరములైనది యిప్పటికిని
నాభర్త సందర్శనము నాకు లభించిలేదుగదా నేనేమిజేయు
దును యింకెట్లు యీ భర్తృవియోగశోకము భరింపగలను హా
జీవితేశ్వరా నాజీవములనిల్పి నన్నుభరించుట భారమయ్యెనే
(అని విచారించును).

చేటిక—(ప్రవేశం తనలో) కమలాభాయి అమ్మగారు యిచ్చటనేయు
న్నారు. అయ్యో యీ ఘోరవార్త నీమెకు నెట్టునివేదింతును.
జెప్పిన నెంతవిచార సాగరంబున మునుగునోగదా? అయినను

జెప్పకతప్పదు. (ప్రకాశముగా) అమ్మా కమలాభాయి మీ నాధునిపై రామనాధ లద్దూఖానులు యొక్కకుట్టున మీాద బడి బంధించి జెరసాలయందు జేర్చిరని మనవీటను ప్రతినోటను జెప్పుకొనుచున్నారు తల్లీ.

కమ—(ఆతురతతో) ఏమేమీా నానాధునే బంధించిరా హా నాధా మీాకెట్టి యిక్కట్టువచ్చినది. యీాదుష్టురాలు వినియును చేత గానిదై నేమియుచేయలేకపోవుచున్నదిగదా? (కనులు మూసి ధ్యానించి) అమ్మా గౌరీ సకల ప్రపంచ జాలంబుల నిండియు, నానాధుని జెరవిడిపించియు నాతో గల్పలేవా తల్లీ. (కంజాక్షి నిజూచి) అమ్మా కంజాక్షీ నింక నీమందిరముకు నేగుము నే నేగి నానాధుని జెరవిడిపించి నా నేత్రపర్వముగా సందరిసించి నాజన్మ సాఫల్యము జేసుకొనియెద.

కమ—చేటికా నా ప్రియుకాని నే జెరసాలయందు నుంచబడిరో జూపింపుము.

(అందరూ నిష్క్రమింతురు.)

మూడవరంగము, ప్రవేశం—బలేరావు జెరసాలయందు.

బలే—ఆహా! నెంతలో నెట్టి యిక్కట్టు సంభవించెను.

గీ. నొక్కఘడియందె నవ్వుచు ♦ నాతితోను
దిరుగుచుంటిని యింతలో ♦ దుఃఖ మొసగె
జెనటిదైవంబు మము బాపె ♦ జూడలేక
గ్యారమతులైన దుర్జనుల ♦ గూర్చిబంపె॥

నాసుగుణములరాసియు, నాయందముల ప్రోగగు నామందగమనయగు నిందిరను నికగాంచుట గలలోనివార్తగదా? గోరగాని రామ నాధ, లద్దూంఖానులకు జిక్కి యీా జెరసాలయందుంచబడితినే నెంత బాహుబలమున్నను, నెంత శౌర్య, ధైర్యస్థైర్యమున్నను నిసుమంత దైవబలములేకున్న దనమాట మంతుకెక్కనేరదే ఆహా! దైవయంత్రము నెప్పటికేమిజరుగునో దెలియదుగదా?

సీ. నవఖండములుండైన ♦ నలమహారి చెందుగ్రిందు
వీర దాసాజ్ఞయు ♦ విశ్వసించె
నాలుగు జెరగులు ♦ నతిమాత్రమున నేలు
నలరాజు పుష్కర ♦ నరునికోడె
నతిబలుండైనట్టి ♦ అల రామ చెందుగ్రిందు.
నాగపాశంబుకు ♦ నలతనొందె
భయదమహా నట్టహాసం ♦ చేర్చు భీముండు
సైంధవుడడ్డ ♦ సలాముగొట్టె

గీ. దైవబలమింతయును దనకు ♦ దగలుకున్న
గడ్డిపరకకు గొరగాడు ♦ గృద్ధిముండ
నరకుజేయుదు తానెంత ♦ సరసుడైన
విధిని ధాటంగవశమె నే ♦ విధమునైనా॥

అయ్యో! నేనెట్లు యీ కారాగారము గడవగలను యీ జెరసాలయందు జావుమని యాబరమేష్ఠి నాకు విధించియుండబోలును నేనేమి జేయువాడను హా పరమేశ్వరా ఈదీనుని రక్షించుట భారమయ్యెనే తండ్రీ నేనెంతవిచారించినను గార్యములేదు ధైర్యమవలంభించి ముందుగార్యము నాలోచించెద నేమని యాలోచించను ఏమికర్తవ్యము.

సీ. బాద ఘాతంబున ♦ బడదన్ని విరుతునా
నిరుగవు తల్పు ♦ నినువమాటచేత
బాహుబలంచేర్చి ♦ పైకేగుదామన్న
గడ్డీలచే లాదు ♦ గప్పబడియె
బట్టి గోడలకెల ♦ బ్రాకిపోవుదమన్న
నెట్టుటకైనను ♦ మెట్టులేదు
బాతాళమునకేగ ♦ బాటజేయుదమన్న
బిలముద్రవ్వుటకు న ♦ గ్గలిక లేదు

గీ. అక్కటా సంకటంబయ్యె ♦ నాకుజూడ
చటులభీషణ సంగ్రామ ♦ చయమునందు
విపుల గేసరినగు నన్ను ♦ యూరబిల్లి
జేసివిడచెను విధియు యీ ♦ జైలునందూ॥

సింక నేనెంత నాలోచించినను నాఆలోచనకు నాది అంత్యములు లేవు గదా ? ఆపత్కాలమందు నాచరించవలసినది హరిపద సేవదప్ప నితరంబులుగావు నెట్టిగుటిల మానసుండైనను, నెట్టి హత్యా పాతకుండైనను తారకమంత్రి జపంబున ధన్యులౌదురని గురు వాక్యంబు గలదుగదా ? యిట్టి సమయములో నాకు దారక మంత్రమే శరణ్యము గావున నెట్టియిక్కట్లునైనను దుదముట్టించునా రామ తారకమంత్రంబు జెపించి కృతార్థుడనయ్యెద (కనులు మొగిడ్చి) హా రామా రామా రక్షింపుము రక్షింపుము. ధ్యానించును.

కమ—(ప్రవేశం తనలో) నా ప్రాణేశ్వరుడు ఈజెరసాలయందుంచబడెనని చేటిక నాతో జెప్పినదే ఈజైలునందు నానాథుడు నెట్టియిక్కట్టులు బడుచుండెనోగదా (ప్రకాశముగా) జూచి హా జీవితేశ్వరా ! హా నాథా గడకు ఈగారాగారము శైనమందిరమైనదియా నాథా ?

ఉ॥ పందిరిమంచమున్ విడచి ♦ పట్టుదుకూలములెల్ల వీడి యీ
చండముగాను దూలినిటు ♦ సైపగలేని మహాప్రయాశముల్
జెందుచు దిక్కులేక గదు ♦ జైలునందున మేనుజేర్చి యీ
యందము మాటుజేసుకొని ♦ యిద్దశబొందితివే మనఃప్రియా॥

అయ్యయో! ఇంక నేనేమి జేయుదాన దల్లీ శాంకరీ సర్వప్రపంచకంబులకు నాధారభూతురాలవయ్యును, సకలచరాచర జంతుజాలంబులు నీస్వాధీనంబునందుంచుకొని జలగాటంబులు నాడింతువు తల్లీ! నీవు జగన్మాతవయ్యును, నాయిలవేల్పువయ్యును నానాథుడు యిట్టిఘోరాగారమందుండి దారిగానక బరితపించుచుండ

నీకు నాపై ననుగ్రహంబురాదా నానాథుని చెరవిడిపించి నాతో గల్పుముతల్లీ.

గీ॥ అమ్మనాయందు నీకూర్మి ♦ నుండెనేని
నెపుడుపతిభక్తి నిడువక ♦ నుందునేని
సత్యమొదవిన పరమ ♦ సాధ్వితినేని
జెయిలుదలుపులు దెరచును ♦ జైయటంచు॥

అని చేతులుజోడించి భవానిని ప్రార్థించును. (జయిలుతలుపులు విడిపోవును).

బలే—జయిలునుంచి బయిటకొచ్చి తన శరీరము గడవిచూచుకొని, ఆహా! యీనాల్గుదినములకే నాశరీరము శృకిక్రి బలహీనత నొందితిని.

గీ॥ బైలుబగు వెట్టు బాముని ♦ బలిమిబట్టి
పెట్టినందున నిముడించి ♦ వదిలపరచి
నాల్గుదినముల నటుకుంచ ♦ నొరుగునైన
విధమునయ్యె నామేను ♦ విధము జూడ॥

నెన్నిరోజులున్నను సారాయిన న్న సత్తువెట్లుతగ్గును నదిలేకపోవుటచే నోరుజప్పబడి నాలుక జిగురుకారుచున్నది. నింక నడుచుటకే శక్తిజాలకున్నది. ఇప్పుడు నా భవనంబునకునేగి సారాయిని జవి జూడకున్న జచ్చిపోవడమే తటస్థించును. (అనిపోవుచున్నాడు).

కమ—(అడ్డముగాదూరి) నాథా! నాథా! నన్ను విడచి ఎటుబోయెదరు మీకేనాదిక్కని నమ్మితినే నాదిక్కుజూడుము ప్రాణేశ్వరా!

బలే—ఎవతెవునీవు ప్రాణేశ్వరాయని సంభోదించుచున్నావు.

కమ—నాథా! నీజీవితేశ్వరినిగానా?

బలే—ఆహా! నెంతటికైనా జంతలుగదా యింతులు.

ఉ॥ ఎవ్వతెవీవు నాదువ్రద ♦ వేశ్వరినంచును వాగుచుంటివో
జవ్వని నీదుభర్తనటె ♦ జాయగనిన్ను వరించినానటే
క్రొవ్విననూటలున్బలికి గొం ♦ కుతనంబున మోసగించెదా
నివ్విధి యూటలున్జలువ ♦ నేరికిజాలునె నీకుదక్కగన్॥

మగువా? నీమాయమాటలునమ్ముటకు యంతవెర్రివాడనుగాను నిక
జచ్చినట్లు నెచ్చటికైనా నేగుము.

కమ—జీవితేశ్వరా! మిమ్ములవిడచి నెట్లుపోవుదానను.

బలే—ఛీ! ఛీ! తుచ్ఛురాలా ఇట్టిమాటలునిక నాడిన నాలుకచీల్తును
సుమా పో పో తొలగుము.

కమ—నేనెక్కడికిబోవుట మీపాదారవిందములు విడచిపోజాలను.

బలే—ఏమది వెళ్ళవా వెళ్ళకున్న గెంటెదజూడుము.

కమ—గెంటినను మీ వెంటనదలనుగదా!

బలే—ఏమీ? వదలవా! వదలకున్ననిదిగో గాచుకో
(అని గొట్టి నీడ్చును).

కమ—నాథా! మీరెంతనన్నుగొట్టినను, దిట్టినను మిమ్ముల విడువ
జాలను మీపాదారవింద సందరిశనమొసగి నన్ను ధన్యురాలను
జేయుడు. (అని పాదములు బట్టుకొనును).

బలే—(గాలితోదన్ని) ఇదినాభార్యనని వదరుచున్నది. నేదైనను
నాకేమీ?

గీ॥ ఓసినో దుష్టురాల ♦ యోదెష్టదేవి
భార్యనంచు నామొనుట ♦ బంటువలెను
వదరుచుంటివి నీమోము ♦ విధము జూడ
ఎప్పుడో విడచినటువంటి ♦ జెప్పగావె॥

నిన్ను బాగ్రితజెప్పుకిగ్రింద నిదివరకే విడచియుంటినిగదా దగుదునమ్మా
యని నన్నునాటంకబెట్టజూచెదవా ఛీ! ఛీ! తొలగుము (అని
పోబోవును).

కమ—(బలేరావుచేతులబట్టుకొని) నాథా! ఇంక మిమ్ములను విడువను నన్ను మీ చేతులతో దునుమాడి నాకు స్వర్గలోకంబు బ్రసాదించి మీ యిష్టమొచ్చినజోటుకి నేగుడు.

బలే—ఏమీ! నన్ను విడవవు నీకు స్వర్గలోకంబు జూపించవలయునా! అట్లైన జూపింతును జూడుము. (అని కమలనుబట్టి విశరవైచి పారిపోవును).

కమ—గ్రిందబడి మూర్ఛిల్లి లేచి, దుఃఖముతో హా నాథా! నాథా! ఎటు జనితివో గదా హా ప్రాణేశ్వరా మీకు నేనెంత వెగటైపోతిని, మీకెంత నీచురాలనైతిని.

తే.గీ. ప్రాణనాథుడు జూడని ♦ పడతిబ్రతుకు
పాతకూపంబు పగిలిన ♦ భాండవంబు
నడవిగాచిన వెన్నెల బూతి ♦ నందునొలగు
బన్నుగాదె పతి బ్రతికి ♦ నిరర్థకంబు॥

ఇంక నేను బ్రతికియున్నను నాయందచందములు, నాముద్దుముచ్చటలు జూచి మురియువారెవ్వరు నేనెన్ని ప్రయత్నములు జేసినను నా నాథుడు నాకొశమౌకన్నాడుగదా ఇక నేనేమి జేయుదాన నాకు మరణమే శరణ్యముగా బోలు తల్లి! జగదీశ్వరీ!

సీ. నీవు నానాథుని ♦ నాతోను గల్పక
యూరకుండుట యేటి ♦ న్యాయమమ్మ
ప్రాణేసువిడచి యీ ♦ ప్రాణంబు నిల్పుట
నసుదమ్మ నామాట ♦ నమ్మజనని
నిన్ను బూజించి ♦ నిర్జరాంగలకు
నిష్టార్థములనొసగు ♦ నీవెగావె
నన్ను బ్రోచుట నీకు ♦ నేరమని దోచెనా
యింకెందుకమ్మ ♦ యీ మేను నాకు

గీ. బ్రతుకజాలను నాబతి ♦ బడయకున్న
నాదుశిరమును నీపాద ♦ నళినములపై
బగలగొట్టియు నేగుదు ♦ బరముజేర
నింకదప్పదు నామాట ♦ నమ్ముజననీ

(పైకిజూచి) తల్లీ! ఇదుగో నామస్తకంబు నీశిలపై బగులగొట్టుకొని నీలోగలియుచున్నాను. (అని బగులగొట్టుకొబోవును).

భవాని—(డాంమని పెద్దధ్వనియిచ్చును. భవానీప్రసన్నమౌను) కమలచెయ్యిబట్టుకొని,

గీ. ఆగు నాగుముకమల ♦ నాతురనేలా
కష్టసుఖములు గావడి ♦ గుండలనుచు
నెంచి ధైర్యంబువిడువక ♦ నిలచియున్న
సతికి స్వర్గంబు నరచేతి ♦ సుమముగాదే

కమలానీవు గడుసిల్లాలువు కమలాక్షుని వరజనితవాటచేతను గష్టముల కాకరమైనను నిక ముందుముందు సుఖములుపొందగలవు నింతలోనాత్మహత్యనేలా

గీ హేమమును నగ్నితప్తంబు ♦ సేర్చిజేయ
గాంతివచ్చుగాదె ♦ గల్మషమువదలి
బణతి బలుకష్టములుపొంది ♦ బతియుభక్తి
జల్పిననుగాదె జగమున ♦ జెందుకీర్తి ॥

గాన, నీభర్తపదధ్యానమే నీహృత్కమలమందు నారాధించుచుండుము నాభక్తిని మరువకుము నీవుముందు సుఖములుపొందగలవు. నింక నేనంతర్ధానమొందెదను.

కమ—చేతులుజోడించి

దండకం. శ్రీమన్మహాశక్తి గౌరీనినున్నమ్మినానమ్మ । మాయమ్మ
నన్ బ్రోవుతల్లీ । జగజ్జాలవల్లీ । సదాకల్పవల్లీ । ముదం
బొప్పమీపాదపద్మంబు । నాడెందమందున్ । సదానమ్మి
యున్నాను । నాయందునాభర్తకున్ ప్రేమగల్పించి ।
నాచేత నాభర్తపాదంబులన్ బూజజేయంగజేయించు తల్లీ!
నీకన్నిల్వలేనమ్మ నావాక్కునమ్మమ్మ । యోతల్లిశార్వా
ణి । ఓనీలవేణీ యికన్ జాగుచేయంగ వీలెందులేదంచు ।
నీవేవిచారించు తల్లీ । కటాక్షించు మల్లీ । నినున్ బ్రార్థ
న్ జేతునోయమ్మ । బంగారుబొమ్మా । ముదంబిత్తుగావే!
మదిన్ నమ్మినానమ్మ । నామీద నీప్రేమపుంజంబులన్ జూపి ।
నాయొక్క నిక్కట్టులన్ ద్రోసి । నాభర్తనాకిచ్చి నాయా
యురారోగ్యముల్ నాకు । సంకల్పమాత్రంబునన్ నిచ్చి
రక్షించు కామాక్షి తల్లీ । నమస్తే । నమస్తే నమః॥

(గమల నిష్క్రమించును.)





# గుండెగుభేల్.

## పంచమాంకము.

(ప్రవేశం, రమ్మసీసాతో — బలేరావు)

బలే — ఈచక్కనిచుక్కవంటి సారాయిలోనిమహాత్త్యెరుగలేక చవటలు కొంతమంది దీనికవగీర్తిదెచ్చిపెట్టిరిగాని నిజముగా నింతసౌఖ్యమైన వస్తువులేదని నొక్కిచెప్పగలను రసాయనవస్తువులన్నిటిలోకి మిక్కిలి రసవంతమైనదనియు, సారవంతమైనదనియు అనేకమంది అనుభవకర్తలు దీనియొక్కసారంబుదీసియే సారాయి యని నామకరణంబుజేసి దీనిఁద్రావి డోలారోహణంబు జేయుచున్నారు. అహా! ఏమి దీనిసువాసన అని ఆఘ్రాణించి॥

కం. సారాయను సంపెంగకు
నారయపరిమళము ♦ నొక్కటై దగయుండన్
కారులుగూతురు కేరుచు
ధారుణిదధమ్ములకును ♦ దెలుసునె మహిమన్॥

ఎంతెంత మహానీయ్యులు దీనిని పానంబుజేసి అంతములేని యిహసుఖంబులనొంది తుదకు అపరరామానుజావతారములుదాల్చి ఎడతెగని యశస్కాములై కడతేరిరి. ఆహా! ఏమి దీనిమహిమ (అనితాగును).

సీ. తాటిసారాద్రావి ♦ తనివితరించిరి
భూతలంబునయున్న ♦ భూమిసురులు
విప్పసారాద్రావి ♦ విపినాటవులయందు
విహరించుచుండెను ♦ యోగివరులు
గూటిసారాద్రావి ♦ కోటీశులుజేయు
ననుచు ఆనందించు ♦ నార్యజనులు
యీతసారాద్రావి ♦ యీలోకమంతయు
మిధ్యయటంచు ♦ వేదాంతపరులు

గీ. సర్వదేశంబులందు దిరుగు ♦ సాధుజనులు
దీనిమహిమంబు దెలిసియు ♦ దివమునందు
దేవతాస్థానములుపొంది ♦ దిరుగుచుంద్రు
వెర్రిశుంఠలకిదియేమి ♦ నెరుగబడదు॥

ఇప్పటి నాలాంటిమహానుభావులను రక్షించుటకు రమ్మే రాముడై మా హృదయకమలమందు నిలచియున్నది. ఆహా! రమ్మెంత మందికి రాజైయున్నది.

సీ. వృద్ధయోగికైనను ♦ సిద్ధయోగికైనను
రమ్ముతో సేవని ♦ రాత్రిబవలు
గొప్పవానికిగూడ ♦ కూలివానికిగూడ
రమ్ముతో సేవని ♦ రాత్రిబవలు
యోగికైనను బరమ ♦ భోగికైననుగూడ
రమ్ముతో సేవని ♦ రాత్రిబవలు
బండితుకైనను ♦ పామరుకైనను
రమ్ముతో సేవని ♦ రాత్రిబవలు

గీ. రమ్మకంటెను యోగ ♦ రాజంబు లేదు
రమ్మకంటెను యిలను ♦ రక్షకులు లేరు
రమ్మసారాయి నాయాత్మ ♦ రాముడగుచు
కంఠమును దిగిజూడ వై ♦ కుంఠమెచ్చు॥

(అని త్రాగును).

(తనలో) ఏమిది యిదివరకెప్పుడును పారవశ్యము నొందని నాశరీరము నేడెందులకో పారవశ్యము నొందుచున్నది. నేమయుండును భూమిని బడుదునేమో

(జోగుతూ)

శా. సర్రీన్ మంచును యింద్రజాలమువలెన్ ♦ సర్వ ప్రపంచంబులన్
గిర్రింమంచును నాదు నేత్రములకున్ ♦ గానంగ నయ్యెంగదా
వెర్రింబట్టెను లేక జారనిషజయన్ ♦ ప్లీ్రీటుతానెచ్చెనో
చర్రింలేవగ దూలిదూరి బడి నే ♦ ర్చన్ జిత్రమయ్యెంగదా॥

నేదియో గారణముండవలయును లేక నాలాంటిమహావీరుడు నమత్త్యవలె నటునిటుజోగునా (ఎదురజూచి) నాప్రియురాలుయిందిర గాదుగదా ఓహో యిందిరే! ఏమినాపుణ్యము!

యింది—(ప్రవేశము) ఆహా మయ్యా, మీలో నిప్పటికి పుణ్యవశంబున గలుసుకొంటిని. (బలేరావుని కౌగలించుకొనును).

బలే—(సంతోషముతో) సుందరీ! నీరోజు మంచిసుదినమునుమా! మనమిద్దరము గలసితిమిగదా యింక నేకొరంతయున్నది. గాని అప్పాకుసెత్తండ్రి గెంటుకపోయి చెరసాలయందుంచెనని విని యుంటినే నెట్లు బందిగమునుండి వీడితివి.

యింది—నాచెలి చెంద్రకేళి మారుతాళమునగ్రహించి బీగమువద లించెను లేకపోయినచో నేజచ్చిపోవలసినదే

బలే— బలే! నీచెలి మంచివుపకారమే జేసినది.

యింద—నాథా! నొక్కనిమిషంబు మీరగపడకున్న నాకు పకయుగ మువలెదో చెడిదిగదా! నాజనకుండెంత క్రూరకర్ముడో మన

ఆనందమును అంత మొందింపదలచి జెరసాలబంధించెను. నట్టి
బంధిగమునసుండియు నాహృదయమంతయు మీామీాద నే నిలచి
మన్మధావస్తను బొందుచుంటిసుమా.

గీ. అన్నపానంబులనుమాన • హర్నిశంబు
నీదుమీాదను వలపుచే • నిదురమాని
నాల్గురోజులువేగిస్తి • నట్టిజరను
బ్రాణనాయక మిముబాసి • బాపినైతి॥

దైవయోగంబుచే నట్టిఘోర జెరవిడచి, మీాలోగలసి కృతార్థురాల
నైతి

బలే— ప్రేయసీ!

గీ. దైవయోగంబునెవరును • దాటలేరు
మనలనిద్దర నెడదీసి • నిన్నునన్ను
వేరువేరుగనుంచి జెర • నిల్లునందు
జేర్చి యిడుములుగుడువంగ • జేయసాగె॥

నింక గతించినదానికి విచారించినలాభంబులేదు కష్టసుఖములు గావడి
గుండలుగదా! దీనికేమి గానియుందిరా నొకకష్టతరమైన నిక్క
చ్చినచ్చినది నడుగుమందువా! వలనందువా!

యుంది— ప్రాణేశ్వరా! ఎప్పుడును మీాయెడ నెట్టిలోపమునుజేసియుండ
లేదే నావద్దను నేదియున్నను నాప్రాణములతో సమర్పింతును.

బలే— సరియే! నీవద్దను ఒకవస్తువనుగాని, గొంతరొఖమును గాని వున్న
యెడల నాకిచ్చుటకిదియే సమయము ఏమంటివా,

గీ. గాల్చుటకు బీడిముక్కైన • గానిలేదు
గిల్పిగొనుటకు ఏవల్ల • కాడులేదు
అరువుదాగిన సారకై • అప్పుబెరిగె
జేత గవ్వైనలేదె నా గ • ద్యనకును॥

నింతైన గొంతద్రవ్యమును నీవీవకున్న నేనింక శంకరగిరిమన్యములు
బట్టుటకు సంసిద్ధముగనుంటిసి. అప్పులువాళ్ళు అరికాళ్లకుమం

టలెక్కించుచున్నారు. నేనింక నిలుచుటకష్టము గనుక నీవా
లోచించుకొని మరిజెప్పుము.

యిది—నాథా! ఇంక మీరెరుగని ధనమెట్లువచ్చినది ముక్కునయున్న
పుడకలుదప్ప నితరవస్తువులు ఏమియు నాదగ్గిరలేవే! అనాడే
నామేనిఆభరణంబులు మీకే సమర్పించి నమస్కరించితినిగదా!
నాదగ్గిరయున్న ధనమంతయు మీకే ఖండఖండములుగా నిచ్చి
వేసితినే యింకనావద్ద నేమియున్నది.

బలే—నేమియూలేదా! నేమియులేకున్న నీవుమాత్రము నాకెందులకు
శీఘ్రముగ నీదారినీవుజూచుకొమ్ము నొక్కక్షణమాత్రమైన
నీవు నిచ్చటనుండవలదు.

యింది—నాథా! మీరిట్లాడిన నాకేదిదెరవు నెట్లుజీవింపను నీవే నా
ప్రాణమనియు, నీవేనాహృదయపంకజ భృంగమనియు నమ్మి
తినే నన్నువిడబాయుట మీకుధర్మమా!

బలే—ఛీ! ఛీ! కులటా నీకపటప్రేమజూపి నాథాయని బిలచినంత
మాత్రంబున నుబ్బి తబ్బిబ్బై సంతోషింతుననుకొంటివా! నరకా
న్నైనను జేతబెట్టని నరహంతికివి. నీమాటలదేటలుబట్టియే మోస
బోతిని ఇంక నీయాటలు జాగిరావు నిచ్చటికై నంజనుముపొమ్ము

యింది—(తనలో) ఆహా! నెంతలో నెంతవిపరీతముబుట్టెను. నేనేమి
జేయుదాన చేతగుడ్డిగవ్వయినను లేదే! నేనేమియీతనికిత్తును.
(ప్రకాశముగా) నాథా! నాదగ్గర మీరెరుగని యేవిధమైన
ఆస్థియు లేదుగదా! అనాడే మీకు అర్పించియుంటినే!

సీ. తాతజేయించిన ◆ తారహారంబులు
జంతలోనమ్మి ◆ జల్లార్చినావు
గోవర్ధనపుచైను ◆ గోరిదండ్రియునివ్వ
అమ్మ జారాకు ◆ నర్పించినావు
జననిజేయించిన ◆ జక్కనినాగంబు
గిల్టీలకై వెళ్ళ ◆ గొట్టినావు

మామామ్మయిచ్చిన ♦ మేలిమిగాజులు
బీడి సిగరెట్లకు ♦ బోసినావు

గీ. నింక నెన్నొన్నినగలు ♦ దాకట్లుబెట్టి
జిత్తజల్లుగబట్టెడు ♦ జిల్లరిష్టా
బాధదీర్చుకునన్ను ♦ ఒక్కికుజేస
వెడలుగొట్టుట యిదియేటి ♦ వెడగుతనము॥

నా వంటివస్తువులు మంటబెట్టి నామానభంగమునకోర్చి నీవేనాదిక్కని, నీవేనాయాధారపురుషుడవని నిమ్మయుంటినే నన్నువిడచుట న్యాయమా ప్రాణేశ్వరా రక్షించుము. రక్షించుము

(అని గాళ్లమీదబడును).

బలే—(గాలితోదన్ని) ఛీ! ఛీ! జెడిపా నీనగలన్నియు నన్నుగురించి బాడుజేసుకుంటివా! నింతటినుంచి జాగ్రతగానేయుండవచ్చును గాని నీకెన్నివిధములుజెప్పినను నాసదనంబువీడకున్నావు నిన్ను గెంటి నీవంటివిజీల్చుకున్నగాని నిచ్చటనుంచి వదలవుగా బోలు నిదిగోగాచికొమ్ము. (అని గుద్ది త్రోసివేయును.)

యింది—(దుఃఖముతో) హా దైవమా! నాకుయేదిగతియు, ఎందు జొత్తును.

గీ. అటులగన్నను దండ్రిని ♦ అమ్మనిడచి
యిటుల విటకాసికిని వెగ ♦ బైతినేను
జేపకును మాంసముకు జెడు ♦ జంబుకంబు
బంగినయ్యేను యిబ్బంగి ♦ బ్రతుకునాదు॥

ఆహా! నేనెంత విచారించినను కంఠశోషయేగాని, కార్యములేదు. నా ప్రియుకాని బాదంబులుబట్టుకొని, బ్రతికులాడెదను. (ప్రకాశముగా) నాధా! నన్నన్యాయంబుగ విడచుటన్యాయమా!

సీ. నర్ధరాత్రియనక ♦ నట్టెట్టుయనకను
నీకోర్కెదీర్చుట ♦ నిదిఫలంబా
నీవస్త్రములకును ♦ నీదాగుడికిగూడ
నర్ధంబునొసగుట ♦ నిదిఫలంబా
వేళదప్పకయుండ ♦ వేడి టీ యుపాహారము
నిచ్చినందుకు నాకు ♦ నిదిఫలంబా
నా మేనినగలెల్ల ♦ నీచేతికందించి
నీయిష్టమునిజెప్ప ♦ నిదిఫలంబా

సీ. దల్లిదండ్రులవిడనాడి ♦ దగిలినిన్ను
జుట్టములువీడి గొంపయు ♦ జుట్టబెట్టి
నీవెగతియని నీపొందు ♦ నిత్యమనుచు
నమ్మిదిరిగిన వెర్రికి ♦ నిదిఫలంబా॥

నాథా! మీకెట్టి యుపకారంబును నేవేళను జేసియుండలేదే! అట్టి పరమబేలను బ్రేమించి రక్షించుము, రక్షించుము.

బలే—ఏమీ! నిన్ను రక్షింపవలయునా, నిన్ను రక్షించడముగాదు భక్షించెదజూడుము. (అని యిందిరను ఈడ్చుచూ)

సీ. గనిపెంచినట్టియా ♦ గన్నదండ్రినివిడచి
విటకాండ్రకై దిరుగు ♦ టిదిఫలంబూ
వైవాహికముమాని ♦ వంటరివై జార
కృత్యములఁజల్పుట ♦ కిదిఫలంబు
యింటిధనంబెల్ల ♦ దుంటరులకుబెట్టు
నీముష్కరముకెల్ల ♦ నిదిఫలంబు
చిగ్గుఎగ్గులువిడచి ♦ చెరియుంచు చెడెపెవు
నీకావరముకెల్ల ♦ నిదిఫలంబు

గీ. రంకుమగనిని మరగిన ♦ రంకుటాలి
వాలచేతను ఎముకలు ♦ విరుగునటుల
లాటిబుచ్చుక గుద్ద నీ ♦ నోటగుక్క
గుళ్లబోడుచుటయే నీకు ద ♦ గినఫలము॥

(అని యిందిరను యీడ్చివిశరివేయును.)

యింది—హానాథా! రక్షించుము. రక్షించుము. (అని మూర్ఛబడిపోవును).

బలే—(తనలో) యీవిటకులాడి నాపాదప్రహారములకు హస్తముష్టిఘాతములకునోర్చి మూర్ఛయో, జావుయో జరిగియుండవచ్చును. ఏదియైననాకేమి జచ్చిననాకేమి, జావకున్ననాకేమి నాపీడవదలినది నేనింక బోవుదును.

(నిష్క్రమించును.)

యింది—(మూర్ఛనుండిలేచి తనలో) ఆహా! యీపాడుజారత్వమువల్ల నెంతమోసముసంఘటించెను, ఎట్టియిడుములకుమూలమైతిని భవనమువిడచి బరువెట్టుబణాతి గడ్డిపరకకుగొరగాదుగదా? ఇంక నన్ను ఆదరించువారెవ్వరు, ఇంకెందుజొత్తును, నెవనిబడుదును ఇట్టిఘోర పాడుజారత్వము బరువిడకుండ లోకమునకు గొంత నీతినేర్పి తుదకు జ్ఞానయోగింద్రుని యాశ్రమముజేరి, వారి పాదపద్మములగొల్చి ముముక్షుముబొందెద ఇంతకన్న వెర వేదియుగానబడదు. (ప్రకాశముగా)

సీ. తల్లిదండ్రిని భర్త ♦ దిగనాడిజెరియించు
గాంతకు నీపాట్లుగాక నిం ♦ కెట్లుజరుగు
దన శరీరంబును ♦ దనకువశ్యములేని
గన్యకునీపాట్లుగాక నిం ♦ కెట్లుజరుగు
గళ్ళకుబాగరెక్క ♦ గామాంధమునదిరుగు
గోమలికీపాట్లుగాక నిం ♦ కెట్లుజరుగు

విటుడునిత్యంబని ♦ విర్రవీగెడు తులువ
కీపాట్లుగాకనిం ♦ కెట్లుజరుగు
గీ. జేసుకున్నట్టిభర్తయే ♦ జరుపు సుఖము
ఏని రంకుమగడెన్నటికినైన ♦ వీపుదోమునా
యనెడు సామ్యంబునిజము ♦ నాయందుదోచె
అనుభవంబయ్యెనాకునో ♦ యన్నలారా॥

బరమపవిత్రమై, బ్రకాశింబునొందు భారతమాత గడుపారగన్న యోపరమ దండ్రులారా! నాప్రియసోదరీ సోదరులారా!

సీ. యీడుజోడునునెంచి ♦ యియ్యంగవలెనయ్య
సుందరాంగులకు మీ ♦ సుతలనెపుడూ
ధనముకాసించి వృ ♦ ద్ధులకు బిల్లలనిచ్చి
గష్టములముంచక ♦ గాంచరయ్య
యీడునొద్దినబిల్ల ♦ నింటనుంచకమీరు
దగిన వరునకునిచ్చి ♦ దనపరయ్య
దనువువెళ్లేవరకు ♦ దాంపత్యముండుట
నెదదలచి మగువను ♦ నివ్వరయ్య
గీ. ధనము ధాన్యంబు మేడలు ♦ ధరణియందు
శాశ్వితంబనిదలచి సన్యా ♦ సులకును
బిల్లనిచ్చియు దరువాత ♦ ఘోరమనుచు
నేడ్చుకంటెను ముందు యా ♦ వీలుగనుడు॥

సకలసద్గుణంబులనొప్పు సతీమణులారా! నన్ను ననుగ్రహించి నాహితంబునువినుడు.

సీ. బతిసేవజేసేటి ♦ పద్మినీమణులార
బరికించరే నేను ♦ బడినపాట్లు
నిరతంబు దలిదండ్రి ♦ నుగుణంబుగదిరుగు
హితులార జూడరే ♦ నాదుపాట్లు

వస్త్రమాంసములకును ♦ సతిభక్తి మెక్కటి
అతివలుజూడుడీ ♦ నాదుపాట్లు
అన్నదమ్ములయందు ♦ ఆదరంబునుజూపు
యింతులుజూడుడీ ♦ నాదుపాట్లు
గీ. మీరునాపోకబోవక ♦ మేదినందు
అత్తయింటికి పుట్టింట ♦ కపయశంబు
కలుగనియ్యక గాటికి ♦ గదులవరకు
కీర్తియేదెచ్చి సత్కీర్తి ♦ గాంచరమ్మా॥
ఇంక నిచ్చటనిలుచుట కర్తవ్యంబుగనుపించదు నేనింక గాషాయివస్త్రములుధరించి, జ్ఞానయోగిందుగల దరిసించెద!
(నిష్క్రమించును.)
రెండవరంగము.
(పలస్త్రీపట్టీలతోను, చినిగినవస్త్రములతోను—బలేరావు ప్రవేశము)
బలే—నావంటిక్రూరుడు నీగువలంబున లేడని నొక్కి జెప్పగలను.
ఏమంటిరా!
సీ. సద్గుణంబులువీడి ♦ దుర్గుణంబులనొంది
కూనిజేసియు గొంప ♦ కూల్చినాను
తాతతండ్రులనాటి ♦ దరుగని ధనమెల్ల
బ్రాంది సారాలకై ♦ బోసినాను
భార్యను బడమోది ♦ బరభామలనుగూడి
వల్లెల్ల బుల్లితో ♦ గుల్లినాను
సుఖజాడ్యములకును ♦ సుద్ధాష్టదంబన్న
చక్కగా సారాయి ♦ మెక్కినాను
గీ. ప్రాణపదమైన స్నేహితుల్ ♦ పొందుబాసి
బంధుజాలంబులెల్ల ని ♦ర్బంధుజేసి
సారావల్లను జారత్వ ♦ షోకువలన
యిల్లువల్లును జేసితి ♦ గుల్లగాను॥

నా అనుభవమున గొన్ని హాంశములు గనిపెట్టుటచే నాయంతరాత్మయ వార్యమైన ప్రేమపుంజంబులు పైకి నెగదన్ని శెప్పుమని తొందరించుచున్నవి. నవిఏవియనిన నామిత్రులకు నివేదించుచుంటిని.

సీ. భార్యకంటెను బరమ ♦ బంధువు పిలలేదు
గష్టమొచ్చిన గాళ్లు ♦ గడగికేయు
భార్యకంటెను వేరె ♦ బరలోకమే లేదు
నన్నిసుఖములునిచ్చి ♦ నాదరించు
భార్యకంటెను వేరె ♦ బరమౌషధము లేదు
బ్రాణమొదలియు దనకు ♦ బ్రాణమిచ్చు
భార్యకంటెను వేరె ♦ బతికి గతులను లేవు
గతియిచ్చి సుతులను ♦ గాంచుచుండు

గీ. గాన సంసారసుఖముకు ♦ గాంతముఖ్య
మనుచు శాస్త్రంబులెల్లను ♦ మొఱలెట్ట
చేలవై విడచిదిగుగుట ♦ బురుషులకును
దప్పుతప్పంచు జాటెద ♦ డప్పుగొట్టి॥

నిట్టి బరమసతులనువిడచి, బాజారుగాంతలనమ్మి భ్రమించుట నిత్తడిని బంగారుఅని భ్రమించునట్టిదిగదా? నెట్లంటిరా!

గీ. గరుగ గరుగంగ నిత్తడి ♦ గాంతిదగ్గి
బొగలునెగసియు బూదియై ♦ బోవునట్లు
పుంచుకొన్నట్టి లంజయే ♦ పూకుగాదె
బసిడిగరుగంగ బ్రభనిచ్చు ♦ భార్యవిధము॥

నింక నేనిచ్చటనిలుచుటకవకాశమే లేదు నాకాకలి బాధపీడింపుచున్నది. మహాత్ముండగు జ్ఞానయోగీంద్రునిదరిసించి కృతార్థుండనయ్యెద? (రెండడుగులునడచి)

జలే—అన్నన్నా ఈపెద్దరణములు చిట్లి నన్నెంత బాధింపుచున్నవి నాయంగమంతయు జలుపుచే బ్రితగీలునందున బటుత్వమే లేకున్నదిగదా! నాముఖకళనంతయుమారి నల్లనిమచ్చలచే

యక్రినికంతులుగల్గి నేనొక కుష్ఠురోగివలె గనుపట్టుచున్నాను. ఆహా! నెంతలో నాయవస్థ దారుమారయ్యెను (అని విచారించును.)

కమ—(ప్రవేశం) ఆహా! భవానీ కృపాకటాక్షముచే నెంత త్రుటికాలములో నానాథుని జేరితిని (ప్రకాశముగా) హా ప్రాణేశ్వరా మీకరుణాకటాక్షవీక్షములచే మీపాదపద్మ సందర్శనమిచ్చి నన్నురక్షించుమునాథా (అని పాదముల పైబడును). (బలేరావు పైకిలేవనెత్తి)

బలే—(తనలో) ఏమిది ఈసుందరి నేనిచ్చటనుంటినని నెట్లు గ్రహించెనో గదా! (ప్రకాశముగా) యింతీ నేనిచ్చటనుంటినని నెట్లూహించితివి.

కమ—నాథా! భవన్మాతయగు భవానియే మీయునికి వినిపించెను.

బలే—సరియేగాని, నాయవస్థ తారుమారైనదే నావల్ల నేమిసౌఖ్య మనుభవించి సుఖించెదవు.

వం. ధనము హరించిపోయె నిక ♦ దేహమునందున బల్మిదగ్గె నా
తనువుననున్న బుండ్లు నతి ♦ తీవ్రముగా జలుపెత్తి బాధచే
అనయము చీముగారుచును ♦ నాపదనొందెను నన్నుగూడ నీ
కెనయగు సౌఖ్యమున్ గలదె ♦ కాంతరొ వెఱ్ఱిభ్రమల్ దలంచకే॥

కమ—నాథా! మీరెట్లున్నను మీపాదసేవచేయుచు యుపచారము జేసి తరించెద.

బలే—అట్లయిన నీకిష్టంబగునట్లు వర్తించుము.

కమ—(పైటచెంగునవిసరుచు) అయ్యయో నెంతలో నానాథుడు వికృతాంగమును బొందెను.

సీ. బంగారమునుమించు ♦ యంగమందునమీకు
కంతులుబ్బెనె ప్రాణ ♦ కాంతనీకు
ముద్దులుగులికెడు ♦ మీమోమునందున
నల్లనిమచ్చలు ♦ నల్లెనాథా

మిసమిసలాడెడు ♦ మీవతుమంతయు
నెండిశుష్కించెనే ♦ నీటుకాడా
నడవశక్తియులేక ♦ తడబడుచుంటివే
నీబాహుబలమెల్ల ♦ నెచటకేగె
గీ. నయ్యయో ప్రాణనాథా మీ ♦ యందమంత
రాహువుగ భక్షించునట్టిరే ♦ రాజుపోల్కి
ఉక్కునకు జెదలుబట్టిన ♦ విధముగాగ
మరులిలను మొల్చు దేవళ ♦ మైతివయ్యో॥

ఆహా! నింకేమి జేయుదాన నాప్రాణపతి! నాజీవాధారము! రోగిష్ఠుడై యుండ నా ఈపాడునేత్రములతో నెట్లుజూడగలుగుదును. అమ్మా! భవానీ భారతమాతా! నాపతి రోగముల చేత నార్తుడై గష్టములుపొంద వీక్షించియు నూరకున్నావా తల్లీ! (రెండు చేతుజోడించి).

ఉ. నాపతిపాదముల్ సతము ♦ నాత్మనునమ్మి భజింతునేని నే
పావము మార్గమున్ జనక ♦ బాయని భక్తినిగొల్తునేని నా
ప్రావగు నాదశక్తియగు ♦ భారతమాతయె నాధుకాంతును
ద్రూపమునిచ్చి బ్రోచుటలు ♦ దప్పదుదప్పదు నాదుభక్తికిన్॥

(అని ప్రార్థించును).

బలే—ఆహా! ఏమినాభాగ్యము నాభార్యాపతివ్రతా తేజోనలంబున న త్రుటికాలములో నాశరీరమున వ్యాపించి పీడించుచున్న కురసకంతులు, యీగల్లనిమచ్చలు, నీ మరదగొల్పు దద్దుర్లు, నీ చీముగారెడు వ్రణములు మటుమాయమైనవే ఏమి ఈమె బతివ్రతా మహాత్యము వెంగలినై నింతకాలము పరస్త్రీ వ్యామోహమున దగిలి నీమెకు పడరానియిడుములు బాలు జేసితినే నేనెంత మూఢమానసుడనైతిని (ప్రకాశముగా) తన్వీ నీయొక్క ప్రభావము నేటికిదెలసుకొంటి గాన నన్ను క్షమించగోరెద.

కమ—నాథా! నన్ను క్షమించుమనుట తమకీ ధర్మమా! సతులు యవివేకముతో జర్పినబనులకు బతులు క్షమించవలయునుగదా! దమరే నన్ను క్షమించవలయును.

బలే—నిప్పట్లో నీవే నన్ను క్షమించవలయును. ఏమంటివా!

సీ. స్నానంబు జేయుడీ ♦ యని నీవు దెచ్చిన
జలపాత్రి జదిమిన ♦ జడుడ నేను
నీకంఠహారంబు ♦ నిమ్మంచు మెడబట్టి
వంచి ద్రెంపినయట్టి ♦ వంచకుండ
కైదున విడిపింప ♦ కనికరంబును లేక
గాళ్లను గ్రుమ్మిన ♦ కటికవాడ
భార్యను నీకంచు ♦ బలు బ్రార్ధనలు జేయ
బట్టి గొట్టినయట్టి ♦ పాతకుండ

గీ. జెడిపెలను మరగి దిరిగి దు ♦ శ్చేష్టలెల్ల
జల్పి దల్లిని దలమోది ♦ జంపదలచి
నట్టి దుర్మార్గనరుడను ♦ సితిహీను
నన్ను క్షమియించ దప్పటే ♦ నళిననేత్రి॥

సుందరీ! నీవుజేసిన మేలు నాహృదయంబున సహస్రవత్సరములైనా మరువగలనా!

గీ. హేవ్యమగునాదు తనువున ♦ నున్నబుద్ధు
మచ్చలెల్లను మటుమాయె ♦ మయ్యెమగువా
నీప్రభావంబు నీపతిభక్తి ♦ నరయగా
లోకమందున జాటెద ♦ లోలనేత్రా॥

కమ—నాథా! మీమన్ననలకు బాత్రురాలనై తరించితిని నింక మన సదనంబునకు నేగుదమురండు.

బలే—మగువా! మనసదనంబుమాట మరువము జ్ఞానయోగీంద్రుని యాశ్రమంబున గొన్నినాళ్ళుండి నాయతిచంద్రునిగొల్చి, తరించి సుఖాంతము రమ్ము.

కమ—చిత్తము.

(నిష్క్రమింతురు.)

(చినిగినవస్త్రములతో రామనాథం— ప్రవేశం)

రామ—ఛీ! ఛీ! ఈలంచములకింద నాసంసారమంతయు జల్లారిపోయి నింకజరగడమే గష్టమని దోచుచున్నది. యీపాడుజారత్వమే నన్నీపాట్లుకుదెచ్చినది. ఏమంటిరా!

సీ. పరకాంతకాసించి ♦ పరగధనంబంత
లంచాలుగ్రింద వె ♦ చ్చించినాను
రాత్రిబవలునుదిరిగి ♦ రమణికై బోరాడి
నాయుణ్ని నాకంబు ♦ కంపినాను
నిసిని నిద్రనుమాని ♦ నింతికైదిరుగాడ
భార్యనేమన్నను ♦ బాదినాను
జేత డబ్బును లేక ♦ జెడి నప్పులనుజేసి
జడియుచు మూలల ♦ జేరినాను

గీ. దుదకు నన్నంబుకు జూడ ♦ దిక్కులేదు
ఏమి జేయుదు నీపూట ♦ నెట్లుజరుగు
గానిపనులకు గళ్ళను ♦ గప్పిదిరుగు
నరుని కెప్పుడు నగుబాట్లు ♦ నెదుటతిట్లు॥

నింక నాసోదరులకు గొన్నిమాటలుజెప్పి మహాత్ముండగు జ్ఞానయోగీం ద్రునిఆశ్రమంబుజేరి నాయనపాదపద్మముల నాశ్రయించి వైరాగ్యమున వర్తించెద.

సీ. ధనమున్నదని మీరు ♦ దగనిపనులకుబోక
బీదల నేడ్పించ ♦ బోకరయ్య
మాన్యంబులున్నవి ♦ మాకేమి భయమని
బళ్ళగొరికియు మీద ♦ బడకరయ్య
సద్వి నియోగంబు ♦ చెయ్యన జరుపుచు
జెడిపిల మరిగియు ♦ జెడకరయ్య

న్యాయమన్యాయంబు ♦ నెరుగుండి దగ మీరు
దగవులు దీర్చుట ♦ దలపరయ్య

గీ. ఏమి శాశ్వతమయ్య యిూ ♦ యిలనుమీద
మంచిచెడ్డలు మనవెంట ♦ వచ్చుగాని
క్షణమొ ఘడియకో జచ్చు యిూ ♦ జన్మతిత్తి
దీనికోసము యింత ♦ దొర్లాటఏలా॥

రామ—నింకనాలస్యమెందులకు నేనిదేబోయి జ్ఞానయోగిని నాశ్రయించెద.

(నిష్క్రమించును)

మూడవరంగము.

(గాషాయివస్త్రములో యిందిర—ప్రవేశము)

యింది—ఆహా! దైవము నెప్పటికెట్లుమార్చునో దెలియదుగదా! దగినింటబుట్టి, దలిదండ్రులకు దలవంపులుగటెల్లజేసి, దగాకోరు విటులమాటలునమ్మి, ధనముసు దగలెట్టుకొని, బడరాని కష్టములకుబాలై తుదకు సన్యాసినై, సన్యాశాశ్రమముకు నేగుచుంటిని. (నెదుటజూచి) రామిశెట్టివలెనున్నాడు.

రామి—(ప్రవేశం) అబ్బో అబ్బో యిందిరాభాయిలాగుంది ఎక్కడికేంటి ప్రయాణం.

యింది—రామిశెట్టీ నింకనీప్రపంచకమునురోసి సన్యాశాశ్రమముకు నేగుచున్నాను.

రామి—ఏంటే! ఇంట్లోది వంట్లోది వూడి యిూజోగురుగుడ్డలకాడికొచ్చి సన్యాసివయ్యేవు. అయితే అయ్యేవుగాని సక్కనోణ్ణి నట్టుకో

యిం—ఇంకనిట్టి సంభాషణజేయకు నేను సర్వసంగపరిత్యాగమునుజేసి సన్యాశాశ్రమమున సర్వేశ్వరునారాధించుచు గాలముగడిపెద

గామి—అయితే పురుషసంగమో!

యింది—రామిశెట్టీ! నట్టి తుచ్ఛసుఖంబులు విడచియేగదా తత్త్వవిచారణజేయుట నీవు సంసారసాగరంబున నీదులాడుటంజేసి నజ్ఞానంబున దెలియలేకున్నావు.

రామి—ఓరయ్యల్లో! దుడకబ్బేరా తురకభాసయున్నట్లు ఈమె మెట్ట వేదాంతంవే కరుపెడుతుంది. సాపట్టుకరా సల్లగా కూరోచ్చె బెడదాం?

యింది—నేనుగూర్చుండుటకు వీలులేదు. జ్ఞానయోగీంద్రునినాశ్రమము నకు నేగుచుంటిని. నీవును నావెనువెంటను వచ్చి తత్త్వజ్ఞానమును నభ్యసించి, కృతకృత్యుడవుగమ్ము.

రామి—ఓరబొబ్బ నాకెందులకు తత్త్వజ్ఞానం. మా యింట్లో తట్టలు, బుట్టలు, తొట్టిలునిండి మూల్గుచున్నవి. వెనక మాయింటికి నొకసన్యాసివచ్చి మాయింటివెనకనున్న వెంకికి వేదాంతం జెప్పితే సన్యాసికూడాచక్కా ఎల్లింది. అదేనాసన్యాసమంటేని.

యింది—అది సన్యాసముగాదు సయ్యాటము. దీనికేమిగాని మీయింటను దట్టలుకొలది తత్త్వజ్ఞానముందని జెప్పితివే ఏదీవక తత్త్వమును సెలవియ్యుడు.

రామి—అయితే ఇందిరా! నేనుజెప్పినతత్త్వమా, నితరులు జెప్పినవా?

యింది—ఏమీ! నీవుతత్త్వములుగూడ జెప్పితివా?

రామి—ఓ! కుప్పకుప్పలు.

యింది—అట్లైన ఏదీ మీరురచించినది వచింపుడు.

రామి—పాడుమంటావా! ఇదిగో (గొంతుక సవరించుకొని పాడును.)

తత్త్వం. దీనిభావం దెలుసుకుండీ । ధర్మమెరిగిన పెద్దలూ
ఎరిగియుంటే జెప్పుకొండీ । ఎర్రివెంగళప్పలూ॥

2. పిల్లిరొకటీ ఆరునెలకల । చల్లగాదిగమింగెరా
చల్లలోపల బిల్లిబడియును । చల్లగాజచ్చేనురా॥ దీ॥

3. చట్టిలోపల బాలు అన్నీ । గట్టిగా పెరుగాయెరా

పెరుగుదరచగవెన్న బుట్టెను । పరమచిత్రంబాయెరా॥ దీ॥

4. వుల్లిపాయ చింతపండు । వుప్పూకారముగలసియూ
పచ్చిపులుసూ రూపమొందెను । పరమచిత్రముజూడరా॥ దీ॥

5. తొడలుసందున ఎడము లేకా । చిమును తాబట్టెనురా
నునుకునీళ్ళతో గడిగితే । వడదన్ను మోక్షముజూడరా॥ దీ॥

6. దండిగా రామిశెట్టిజెప్పిన । తత్వమిది ఎరిగుండుడీ
మొండివాళ్ళకు దెలియరానిది । బండలకు శైలయినదీ॥ దీ॥

యుంది—రామిశెట్టీ! ఈతత్వము నీవుజెప్పినదా! నితరులెవ్వరైన జెప్పినదా?

రామి—అమ్మతోడు నేనబద్ధమాడుతానా మాఅయ్యతోంత, మా అత్తప్పతోంత, నేనుతొంతా చెప్పిం అఖరుముక్కనాదిఅవుటచే లంకిలాగు అంకితంతగిలించేను.

యుంది—నీవుబాడినతత్వమందు వేదాంతసారమేమియు గనపడదే మరియొకటివచించుము.

రామి—నాసొంతముగాజెప్పినది వదలమంటావా?

యుంది—నీసొంతముగాకొన్న జెప్పితివా! అట్లైననేదీనీసొంతకవిత్వము.

రామి—ఇదిగో వదలుచున్నానుకాసుకో (గొంతుక సవరించుకొని పాడును).

తత్వం. అబద్ధమాడకేమనసా । నీ అబద్ధమాడకేమనసా॥

1. అబద్ధమాడితే అకర్కొచ్చేమాట । అడినానాడొచ్చు
అందుదప్పే లేదు॥ అబ॥

2. వీలుగాయుంటేను ఎదురింటివాడిని । ఏడిపించావచ్చు
మనసా వీలుదప్పీయుంటే । వెనకరుగుమీాదను యింటిలో
ఏడవేమనసా॥ అబ

3. నీగుట్టువివ్వకా నెదుగుగుట్టూదీసి । నమ్మిదిగిన వాణ్ని
మనసా నట్టేటిలో ముంచి । నానతిప్పలుబెట్టి నాకరికి
గడతేర్చుమనసా॥ అబ॥

4. లోకువోళ్ళుంటేను కేకలేసియు నీవు । పారలెగరెయ్యవే
మనసా బూకరించియు నిన్ను । పక్కలిరగేస్తేని నక్కి
పోగెట్టవే మనసా॥ అబ॥

5. ధరణిలో రామిశెట్టి కోరి సొంతముగాను । కూర్చినాతత్వ
మిదిమనసా ఎరుగున్నవారలూ । నోరుజారి దీనిసారమం
తయు గ్రోలుమనసా॥ అబ॥

యింది—నిదివట్టి ప్రకృతిననుసరించి జెప్పితివిగాని, దీనిలోయంత వేదాంతవిశేష మగుపడదు. నీవు ప్రకృతిననుసరించియే దిరుగాడుచున్నావుగాని దివ్యజ్ఞానసంపన్నుండవని దోచదు. గాన నీవు జ్ఞానయోగీంద్రునాశ్రయించిన నీయజ్ఞానాంధకారమువదలి సుజ్ఞానముగలిగి తరించగలవు. నేనరుగుచుంటి నీవునావెనువెంటరమ్ము జ్ఞానయోగీంద్రుల పాదపద్మములుగొల్చి తరించి కృతార్థులమౌదుము.

రామి—నీకూడా నేనురావలసిందేనా?

యింది—తప్పక నీవురావలసినదే.

రామి—అలాగైతే మాఅత్తప్పను అడిగివత్తాను.

యింది—ఇందుకు మీఅత్తప్పను అడుగవలయునా!

రామి—మాఅత్తప్పనడక్కపోతే అల్లరొచ్చిందన్నమాటే! ఏంటంటే నేసన్యాసినైపోతానని శోకాలెట్టి శాపాలెడతాది.

యింది—రామిశెట్టీ! నీకు ఏవిధమైన ఆశపాశంబులు అరవీశమైనను అడుగంటలేదు నీవింక నాతో రాలేవు నేనరిగెద.

రామి—అలాగైతే రావద్దూ రచ్చించేవన్నమాటే వప్పుకున్నాను దేముడాఅని అనుకున్నానుగాని బ్రతికేనన్నమాటే! అయితే యిందిరా ఇంకనీవెల్లు.

(ఇందిర నిష్క్రమించును).

రామి—ఎర్రిమొకం వేదాంతంలోదిగి యవారంజేస్తే లాభంగూబల్లో

గొచ్చి గుయ్యిమందూ ఎనక మా అయ్య వేదాంతంలోదిగి
అన్ని సంగాలువదులు కొని స్త్రీసంగం మానేవాడుగాదు అందు
చేత యవారంఎనకాడి దిక్కులేక దివాళాదీసి వెల్లకితలబడి
కాలె త్తేసిందిగందా యిక యీ ఏదాంతానికి మాకు సక మెరికి
ఇంక నేనింటికెళ్ళి సంచిసవరించుకొని సంతకెల్లాల.

(నిష్క్రమించురు.)

నాల్గవరంగము.

(జ్ఞానయోగీంద్రునిఆశ్రమం—శిష్యులతో ప్రవేశం.)

జ్ఞాన—శిష్యులారా!

గీ. మట్టికుండతో నెనయగు ♦ మాయతనువు
దీనినమ్మియు డాబుగా ♦ ధనముగూర్చి
భార్యబిడ్డల గృహమనే ♦ భ్రమనుజెంది
దిరుగుటయుగాని దీనికి ♦ దెరవులేదు॥

ఏమంటిరా!

ఉ. మాయయనంగ నొక్క తెర ♦ మాటున మానవకోటులెల్ల యీ
ఛాయని మోహజాలమున ♦ భార్యలు బిల్లలు భాగ్యసంపదల్
ఏయెడ నిత్యమున్ నిలుచు ♦ నాకని నాత్మదలంచి నాట్యమున్
జేయుచు బొమ్మలాడుక్రియ ♦ జత్తురు జొత్తురు ప్రేతభూమికిన్॥

నిట్టి మాయాశరీరమునమ్మి మిట్టిబకు మిడత చందంబున మృత్యుపాతం
బడి నీల్గడమేగాని నీజన్మతరించు తరుణోపాయంబులేదుగదా?

శిష్య—మహాత్మా! నీజన్మతరించి సుఖించుమార్గమెట్లనో మాకుప
దేశించి మాజన్మతరింపజేయుము తండ్రీ.

జ్ఞాన—పుత్రులారా! ఈజన్మతరించుమార్గమెట్లన్నను నిర్మలహృదయు
లై నాలకించుడు. సుజ్ఞానము, అజ్ఞానము అను రెండువిధములు.
సత్యము, అసత్యము రెండువిధములు. ధర్మము, అధర్మము
రెండువిధములు స్వర్గము, యమలోకము రెండువిధములుగదా?
ఇందుసుజ్ఞానమునుగురించి ముందువిచారింతము. సుజ్ఞానమువల్ల

సత్యమువచ్చును. సత్యమువల్ల ధర్మప్రవర్తనకుఁజొచ్చును. ధర్మమువల్ల బుణ్యము వచ్చును దానివల్లస్వర్గలోకమునఁ ష్ఠింతురు. నింకనజ్ఞానమన్ననో అజ్ఞానమువల్ల నసత్యమొచ్చును. అసత్యమువల్ల అధర్మముజెప్పును. దానివల్లను పాపమునుఁ ద్ధినొందును. దానివల్ల యమలోక పలపడును గాన

కం. అజ్ఞానమె శూద్రిత్వము
సుజ్ఞానమె బ్రహ్మమంత్రు శ్రుతులన॥

అని వేమనయోగీంద్రులు వచించినట్లు వినరా అజ్ఞానమను అంధకారమునబడి అనాదిపురుషుఁడగు రామునిగానలేక రౌరవాది నరకంబులబడి దారిగానక రాత్రింబవళ్ళు బరితపించుచున్నారు. నింకసుజ్ఞానమన్ననో! కేవల పరబ్రహ్మస్వరూపమును బొంది నిత్య అనిత్యములను గుర్తెరింగి, తత్వాతత్వగుణంబులెరింగి, సత్వగుణంబునొంది, సత్యస్వరూపుడగు రాముని తన హృత్కమలమందు జేర్చి, తన్మయత్వమొంది, ధ్యానించి దుదకు పుణ్యలోకమధిష్టింతురు. గాన నాయనలారా! నట్టిసత్యమే పరబ్రహ్మమునుమా ?

యింది——(ప్రవేశం తనలో) ఇదియే జ్ఞానయోగీంద్రులవారి ఆశ్రమం ఇందు శిష్యులతో మహాత్ముడేదియో విచారింపుచున్నారు. (ప్రకాశముగా జ్ఞానయోగిని సమీపించి) స్వామీ! మీపాద పద్మములకు యీదాసురాలు నమస్కరించి కృతార్థురాలౌచున్నది (అని నమస్కరించుచున్నది.)

జ్ఞాన——సుఖీభవ! సుఖీభవ! తల్లీనీవిట విశ్రమింపుము.

యింది——తండ్రీ! నిటవిశ్రమించుటకు నాశరీరము జారవశ్యమునొంది తన్మయత్వమువొందుచున్నది. నెటుజూచినను నావరంజ్యోతిస్వరూపుడగు రాముడు నా నేత్రకమలములకు గోచరింపుచున్నాడే

ఉ. ఎచ్చటఁ గాంచినా హరియె ♦ నెచ్చటఁ జూచిన రాము రూపమే
నెచ్చట కేగినా గదలి ♦ నన్ గనుమూసిన రాము రూపమే
నచ్చుపడంగ నన్ని దిశ ♦ లందున నా హరి నాడి నట్లుగా
బెచ్చు పెరింగి ఎల్లెడల ♦ బేర్చెను బైకొని రాము రూపముల్॥

యోగి చంద్రిమా! నింక నేనెట్లు దిరుగాడుదును. నింక నేనెట్లు విశ్రమింతును. నెటుజూచిన రామమయమ్మె గానవచ్చుచున్నది.

జ్ఞాన—తల్లీ! నీవు మహాభక్తి సుగుణవయోరాసివగుటంజేసి నా రాముడు నీయందు భక్తవాంఛల్యంబున దరిశనీయంబగుచున్నాడు. గాన నీమనంబు శెవరనీక రాముని నారాధించుతల్లీ.

(ప్రవేశం—బలేరావు)

బలే—అహా! జ్ఞానయోగీంద్రులవారి నాశ్రమమెంత భక్తిపుంజముల వెదజల్లుచున్నది. నీమహానీయుని పాదారవిందముల నాశ్రయించి, వైరాగ్యమున వర్తించెద? (జ్ఞానయోగిని సమీపించి) యతిచంద్రమా! నమస్కారము నమస్కారము.

జ్ఞాన—సుఖీభవ! సుఖీభవ! కుమారా! మార్గాయాసమున నలసినట్లున్నావు నీయాశ్రమంబున గొన్ని నాళ్ళుండి నీమార్గాయాసమును దీర్చుకొనుము.

బలే—సౌమ్యమీంద్రా! తమయాశ్రమంబుకు వచ్చినదాదినుండి నాకొకవిధమైనమార్పు హృదయంబున గల్గుచున్నది. నేనిచ్చట నిలుచుటయే కష్టసాధ్యమునగనుపట్టుచున్నదిగదా?

గీ. భూజములయందు గుట్టల ♦ బుట్టలందు
బుప్పజొంపంబులందున ♦ బులుగులందు
బొదలుయందున భూధర ♦ బిలములందు
గానబడుచుండె రాముడు ♦ గన్నుగవకు॥

తండ్రి యతిచంద్రిమా! నాశ్రీరాముని ప్రభావమెట్టిదో గాని నట్టి ప్రకాశమున నా నేత్రములకు మిరుమిట్లుగొల్పుచున్నాడు. హా! రామా రక్షించుము. రక్షించుము.

చం. దశరథరామచంద్రనిక ♦ ధన్యునిజేయుము నామంబునా
గౌశరిభజించెదన్ మిగుల ♦ గారుణికోత్తమ నాదరించవే
దశదిశలందు నీదు ఘన ♦ తేజమునిండియు నాదుచూడ్కికిన్
మశలినఖండమయ్యె రఘు ♦ మాన్యపరాత్పర నన్ను బ్రోవవే॥

జ్ఞాన — కుమారా! నీపుణ్యమెంతనిగొనియాడుదును. నీవు నపరభక్తశిఖామణివౌటచేతను పూర్వజన్మ మహాపుణ్యఫలంబున్ జేసి నాభక్తచింతామణి, నాభాస్కరకులసంజాతుడు, నారఘువీరుడు, నాతారకనాముడు, నీనేత్రకమలములకు గోచరీయుండగుచున్నాడు. గనుక నాయనా నీవునొక్కంతె నీహృదయకమలముజిక్కబట్టి నా రాముని నారాధించుముదీన నీకుగైవల్యము సంప్రాప్తించును.

బలే — తండ్రీ! నెట్లునామనంబుజిక్కబట్టుదు నాతనువు పారవశ్యము నొందుచున్నది. నీలమేఘశ్యాముడు, కౌస్తుభవక్షుడు, దీనశరణ్యుడు, శ్రీరామచంద్రపరబ్రహ్మమూర్తి నెటుజూచిన గానబడుచున్నాడే హా రామా! నాజన్మతరింపజేయుముతండ్రీ.

ఉ. వెయ్యేండ్లున్ దలక్రిందుగా ద ♦ పము జేయంజాలు యోగీంద్రు లేదె
లియంజాలరు నీస్వరూప ♦ లెటులన్ లక్ష్మీశ బాలింవు దుర్మ
తియుంజారుడ గూ్రరగన్మ ♦ డతితీవ్రయత్త చిత్తుండనై దె
లియంగన్ మిముజాలువాడ ♦ లెటు మాయామహాత్మాగుణభ్రాంతినై॥

(నాకశంబువంకజూచి) తృటికాలములో నీమిరిమిట్లుబాసి స్వచ్ఛమైన దెల్లని దేజోమయమై. బహ్మాండము నావరించువెల్గు గానవచ్చుచున్నది. ఏమైయుండునో (చేతులుజోడించి).

చం. దేవతలందు దైత్యయుగా ♦ దులయందు ఋషీంద్రులందు కిన్నె
రవరులందు యక్షగరుడో ♦ రగ శిద్దదిశాముఖంబులన్ న
రవరులందు గేచరులగో ♦ రి గిరులున్ నదులందు సర్వమును
నీవరయనిచోటులేదు మ ♦ ను వంశనిధానమ రామచంద్రమా॥

(అని ధ్యానము జేయును.)

రామనాథం—ప్రవేశం.

రామ—ఇదియే మహాత్ముండగు జ్ఞానయోగీంద్రుని యాశ్రమము. ఏమిది యీ ఆశ్రమప్రభావంబు నెచ్చటజూచినను లెక్కకుమిం చిన రామస్వరూపంబులె కనులకు మిరుమిట్లుగొల్పుచున్నవి. ఆహా!

ఉ. గలయో బ్రాంతియో నిక్కమో ♦ గనగ నేనే రామనాథంబనే
దెలియఁజాలను దివ్యతం ♦ త్రిమిది దేవా దీనునిన్ బ్రోవు నీ
గలియందున్ దెలియంగ నా ♦ కువశమే గర్మాదిపాశబద్ధుండనై
నిలయందున్ దిరుగాడుచున్ ♦ నిటులనుంటిన్ రామ రక్షింపవే॥

(అని నమస్కరించును.)

(జ్ఞానయోగినిసమీపించి) స్వామీ జ్ఞానయోగిచంద్రమా! నీ దాసుడు ఈరామనాథం మీచరణద్వయములకు నమస్కరించుచున్నా డు రక్షించుముతండ్రీ (అని నమస్కరించును.)

జ్ఞాన—సుఖీభవ! సుఖీభవ! బాలకా మా ఆశ్రమంబునకరుదెంచితివి నింక కృతకృత్యుడవయ్యెదవు. నింకనీవు మనఃశాంతినిబొంది నాఆసనంబున విశ్రమింపుము

రామ—తండ్రీ! నెట్లు నామనఃశాంతినిబొందుదును. నెటుజూచినను రామమయమై గానవచ్చుచున్నదే!

తే. నీలమేఘతను బ్రమ ♦ నెగడువాడు
కమలములబోలు గన్నులు ♦ గలుగువాడు
విపులయాజానుబాహుడై ♦ వెలయువాడు
గానబడుచుండె రాముండు ♦ కనులయెదుట॥

నింక నామనంబెట్లు నూరటగలుగను, నేనేమిసేయుదును, నెట్లుదిరు గాడుదును.

జ్ఞాన—నాయనలారా!

ఉ. ఏమితపంబు జేసితిరొ ♦ ఎట్టివ్రతంబులుజల్పినారొ మీ
రేమిసుపుణ్యముల్ పుడమి ♦ గామితముల్ దగజేసినారొ నా

స్వామియు రామచంద్ర గుణ ♦ సాంద్రుడు సుందరవిగ్రహుండు మీ
మీ మనములు లెంచగోరి ♦ మహాత్ముడు రాముడు గాననయ్యెడున్॥
అయినను మీ యుదంతమంతయు నాదివ్యజ్ఞానదృష్టిచే నరసితిని. మీ
చరిత్రమంతయు నతిచిత్రమై నద్భుతనానందంబుల నెలగొల్పు
చున్నది. (రామనాథమువంకదిరిగి) రామనాథమా నిటనిలుచుం
డుము. బాబూ బలేరావూ నిటకురమ్ము. అమ్మా యిందిరా
నీవుగూడ నిటనిలువుము.

(ముగ్గురు మహాప్రసాదమని నిలుచుందురు,)

జ్ఞాన—అయ్యలారా! మీ యుదంతమంతయు వినుపించెదనాకర్ణింపుడు

సీ. రామభక్తుండగు ♦ రామనాథమ నీవు
సూర్యపుత్రుడవు ♦ సుగ్రీవుగావె
బలవంతుడైన యో ♦ బలెరావ నిను గాంచ
వాసవితోమరుడ ♦ వాలిగావె
ఓతల్లి యిందిరా ♦ నీ తెరంగరసిన
తారుగుణూర్తివు ♦ దారగావె
మీ మువ్వురకు గూడ ♦ మోహపాశంబులు
విడకున్కి రాముడా ♦ విధము దెలసి

గీ. క్రోధఘూర్ణిత మానస ♦ క్రోధుడగుచు
దన్ను మరచియు ధరణి ♦ దిరుగాడుచేత
నేడినందున నరజన్మ ♦ మెత్తిమీరు
గామక్రోధంబులనుదగిలి ♦ కష్టమొందిరి॥

డుడకు నాపదంబునకు రాగలరని నాపరంజ్యోతిస్వరూపుండగు రాము
డానతిచ్చెగాన నామితిదివసంబులు నేటికి సంపూర్ణంబునొందిన
వాటిచే నారాముడు భక్తవత్సలుండుగాన మీకు వైకుంఠ
సన్నిధానంబిచ్చుటకుముందు మీ పాపాంధకారమనే చీకటిని
తన తేజోమయమైన స్వరూపమును మీ వృయములనాటి, మీ
గనులకు మిరిమిట్లుగొల్పి మీ పాపపుంజంబులు పటాపంచలు

చేయుచున్నాడు. గాన, యోమహనీయులారా! మనమింక నాలసింపక నాతారకనాముడగు రాముని హృత్కమలమందు నిడి నారాధించిభజనజేసిన నాభక్తవత్సలుడువైకుంఠంబునొసగి పునరావృత్తిలేకుండ గలుగజేయును. గనుక రండి భజన మొదర్తుము.

(అందరూ కరతాళములతో భజనజేతురు.)

(ఢాంమని పెద్దధ్వని వినబడును. అందరూ నిర్విణ్ణులై జూతురు.)

(రాముడు—ప్రత్యక్షమౌను)

రాముడు—భక్తులారా!

కం. మెచ్చితిని మీదుభక్తికి
నిచ్చితి వైకుంఠమీకు ♦ నెంతయు బ్రీతిన్
సచ్చరితులార యిక నా
యచ్చెరువైనట్టి పదము ♦ నందుడు మీరల్‖

అందరూ—ధన్యోస్మి! ధన్యోస్మి! (అని నిష్క్రమింతురు)




ఈనాటకమును అచ్చువేయించుటకు నన్నుప్రోత్సహించి చందాలు ఇచ్చిన నా సోదరుల జాబితా.

ఎల్లమిల్లి.

సుంకవిల్లి అబ్బాయిఅనే వీరన్న గారు
లింగం తిరుమలరావు ,,
భావ్వరపు వెంకటాచార్యులు ,,
నార్కెడమిల్లి సీతారామస్వామి ,,
తమ్మన సత్యనారాయణ ,,
పోకల అప్పరాయుడు గారి కు॥ సుబ్బారావు ,,
కోన వీరయ్యగారికు॥ సత్యం గారు
మహాశివబట్టు అప్పలరాజు ,,
యడ్లపల్లి తమ్మయ్యగారికు॥ బాపన్న ,,
వీరిసహోదరులు చినవీరన్న, సుబ్బారావుగార్లు
యడ్లపల్లి వీరయ్య ,,
సత్తి వీరన్న ,,
బొడ్డు నారాయణమూర్తి ,,

పోకల సూరపరాయుడు గారికు॥
బుల్లి వెంకన్న గారు
సుంకవిల్లి పెంటయ్య ,,
సుంకవిల్లి విష్ణుమూర్తి ,,
పోకల తమ్మయ్య గారికు॥ నరసయ్య ,,
సుంకవిల్లి దొరయ్య గారికు॥ వీరన్న ,,
పోకల చినఅప్పలరాయుడు ,,
పోకల క్రిష్ణమ్మ ,,
పోకల వెంకటపతి ,,
కోన వెంకటస్వామి గారికు॥ సత్యం ,,

తామరాడ.

గోకేడ వెంకటారావు గారు
అరిశ సోగారావు ,,
సారా వీరాస్వామి ,,
పంచాది పేరయ్య ,,
తోట వీరనరసయ్య ,,
బొండాడ శ్రీరాములు ,,
గోడి ముత్యం ,,
లంక సూర్యనారాయణమూర్తి ,,
పసుపులేటి అప్పలరాజు ,,
కోసనం వీరన్న ,,
గొంటున వీరన్న ,,
యానాం శ్రీరామమూర్తి ,,
సున్నం బుల్లివెంకన్న ,
కొండపల్లి వీరభద్రుడు ,,
గోకేడ కామరాజు ,,
పుల్లి కన్నయ్య ,,
ప్రిగళ్లపాటి సూరరాజు ,,
శింహాద్రి అచ్చిరాజు ,,

సోమూరాయణంపేట.

దాడి పెదసూరయ్య గారు
రాపాటి క్రిష్ణమ్మ ,,
పీలా కనకయ్య ,,
కాళ్ళ వెంకటరత్నం ,,
సేనాపతి వెంకన్న ,,
పప్పల రామస్వామి ,,

శిరివాడ.

మద్దూరి అప్పన్న గారు
పల్లికల స్వామి ,,
కొంపెల్ల వీరభద్రము ,,
జగ్గలపూడి అచ్చితరామయ్య ,,
మిరియాల పద్మరాజు ,,
పాబోలు సత్యనారాయణ ,,
యినకొండ వీర్రాజు ,,
కట్టోజు సుబ్బారాయుడు ,,
బూరాడ సోమన్న ,,
కమ్మెర్ల సత్యం ,,
మార్నిడి సుబ్బారావు ,,
మలిరెడ్డి బుల్లిఅబ్బాయిఅనే
అప్పారావు ,,

రామచంద్రపురం.

బండారు సూరన్న గారు
కామిశెట్టి వీరాస్వామి ,,
పంచోల్లు బ్రహ్మం ,,
వీరమళ్ల బ్రహ్మం ,,
వీరమళ్ల సత్యంనారాయణ ,,
దుద్దుపూడి మల్లయ్యగారు గోనేడ.

కాకినాడ.

పట్నాల చిట్టెయ్య గారు
కింతాడ రామచంద్రం ,,
సర్వసిద్ధి అప్పన్న ,,

రాజమండ్రి.

దుద్దుపూడి ఆదినారాయణమూర్తి గారు
కర్రి వెంకటరత్నం ,,
కొండేపూడి నారాయణం గారికు॥
బ్రహ్మం ,,
మహారాజ గంగాధరస్వామి ,,
కోలపర్తి సుబ్బారావుగారు పులిమేరు.

పెద్దాపురం.

తాళాభక్తుల గంగరాజు గారు
తాళాభక్తుల పెదనారాయణమూర్తి ,,
బొబ్బాడ బసవలింగం ,,
పట్నాల వరహాలు ,,

### గుడివాడ.

బ్బిన పెదవీర్రాజు గారు

సబ్బిన బుల్లివీర్రాజు ,,

చెవ్వాకుల అప్పారావు ,,

సోరపురెడ్డి సత్తిరాజు ,,

బోండా ఉమందాను ,,

గుండాబత్తుల సుబ్బరాజు ,,

బండారు గుర్రాజు ,,

కట్లోజు సాంబమూర్తి ,,

చీటికాడ జగ్గయ్య ,,

తాడ్డోజు సత్యంనారాయణం ,,

తూరంగి సింహాచలం ,,

తూరంగి అప్పన్న ,,

యండపల్లి సత్యం గారు ధర్మవరం.

నాముగిరి రామమూర్తి గారు } రాగం

కోటి సుబ్బారావు గారు } పేట.

### తాళ్లూరు.

మహారోజు వీరన్న గారు

బెన్నాభక్తుల భీమలింగాచార్యులు ,,

పోలీసు సర్కిల్ యినస్పెక్టరు గారు

మకాం, నర్సీపట్నం.

### నాగులాపల్లి.

నరవ బుల్లిరాజు గారు

నరవ చినవీర్రాజు ,,

నరవ సత్యంనారాయణ ,,

### రత్నయమ్మపేట.

నక్కా బంగారయ్య గారు

### ఉప్పాడ.

మాపూరి జగన్నాధం గారు

నరవ కనకం ,,

వుప్పరపల్లి నారాయణమూర్తి ,,

నరవ శంకరాచార్యులు ,,

### అమీన్‌బాదా.

కొత్తలంక భీమన్నాచార్యులు గారు

పిల్యాణం బంగారయ్య ,,

వుండవిల్లి నారాయణమూర్తి ,,

### నాయకంపల్లి.

యామిజాల వెంకట్రావు గారు

వింజమూరి అచ్యుతరామయ్య ,,

కొంపెళ్ల లక్ష్మీనారాయణ ,,

పెదింటి నరసింహాచార్యులు ,,

దివిలి వెంకన్న ,,

గానుగుల సూరయాచార్యులు ,,

### కాటారివులపల్లి.

దివిలి సుబ్బారావు భాగవతార్ గారు

### వెంగయ్యమ్మపురం.

గొర్తి అప్పలస్వామి గారు

కొండెంపూడి భీమరాజు గారు దంగేరు.

### ఏండ్రి.

నర్ల వెంకట్రావు గారు

నర్ల సత్యం ,,

గాదె వెంకట్రావు ,,

గోవిముడితల సత్యనారాయణ ,,

బసిరెడ్డి రాజు

కొండెపూడి వీర్రాజు ,,

తాడ్డోజు నారాయణమూర్తి ,,

### చెదలాడ.

వొబ్బిలిశెట్టి రెడ్డియ్య గారు

పొన్నాడ సత్యనారాయణ ,,

### యేనాం.

శొంఠేణం పోపరాజు గారు

శొంఠేణం కన్నయాచార్యులు ,,

### శంఖవరం.

అనిమళ్ల సుబ్బారావు గారు

కుగెర్రి సోమన్న ,,